# కష్టజీవి - తెలంగాణా

## బుర్రకథలు



- సుంకర సత్యనారాయణ

# కష్టజీవి - తెలంగాణా

## బుర్రకథలు

సుంకర సత్యనారాయణ



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ నెం. 1670

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : 1956
పంచమ ముద్రణ : జూన్, 1992

టైటిల్ డిజైను : రమ

వెల: రూ. 12-00

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన్‌భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్-500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్నం,
గుంటూరు, తిరుపతి, హనుమకొండ,
అనంతపురం, కాకినాడ.

---

ముద్రణ : లక్ష్మీ గణపతి ప్రింటింగ్ ప్రెస్
SRT-199, 1-1-379-50/1, జవహర్‌నగర్,
హైదరాబాద్ - 500 020.

# ప్రార్థన

(రూపకతాళం)

అమిత సుఖప్రదాయివి - హాలికయిదె వందనము ||అ||

దుండగీంద్రు - దోచినార?
నిరతంబును నీ పంటలు ||దుం||

నీవు వస్తులుండి యిటుల
నేలపాలౌదువా! ||అ||

కూలీ నీవు కూడియుండి
యీ నీచుల నెదిరించిన ||కూ||

నిలువలేరు నిమిషమైన
సాగి ముందు కేగుమ ||అ||

* * *

# వంతపదాలు

1. వినరా భారత వీరకుమారా
విజయము మనదేర

2. కూడిచరించిన విజయము మనదే
కూలి రైతులార

3. జయము జయము మన మహిళలందరకు
జయము గలుగుగాక!

# కష్టజీవి

రామాపురమని వుత్తరాదిలో - రాజిలు నొకపల్లె
రామారావను జమీందారు దా - రామాపురమండి
ఆ పల్లెను గలవన్ని గుడిసెలే - అడవికంప దడులె
రే పవ లెరుగని కష్టజీవులకు - కాపుర మా వూరు
ఎండకు ఎండుచు వానకు తడియుచు - కండలు కరిగించి
బంటచాకిరీ చేయుచు భూమిని - శ్రద్ధలుగా దున్ని
పండింతురు ఆ రైతులు కూలీల్ - పంట చెమట నోడ్చి
పండవు పొలములు యెంతగ వారలు - పాటుబడినగాని

వ॥ ఏల నందురా !

చెరువు మరమ్మతు జమీందారు తా చేయించడు యెపుడు
మెరకవేసె నా చెరువు పూర్తిగా - మొరవిను వారెవరు
ఎండిన పండిన ఖర్చులు తప్పవు - ఎప్పడు రైతులకు
పండిన దాంటో రావునౌకరుల - పాలు దప్పదండి
మానేజరునకు ఠానేదారుకు - మామూలివ్వాలి
చేనులోన పండిన ధాన్యం బిటు - చెల్లాచెదరౌను
పస్తులు వుండి భార్యల మెడలో - పుస్తెలు తెగనమ్మి
శిస్తులు గట్టనిచో యిక వారిది - చెప్పలేము బాధ
రచ్చచావిడికి పిల్చి వీపుపై - రాతిబండ నెత్తి
యిచ్చువరకు నా బండదింప రా - తుచ్ఛాత్ములు బాబు
తరుణం బిదియని యరుగుదెంతు రా - ధనమదాంధు లటకు
సరినాగని రెండింతల నాగని - యిరుకున బడవైచి
గొరిగించియు నా రైతుల నందర - దురితాత్ములు వైన
సొరకాయలు తెగగోతురు రైతుల - దరిచేర్చామంచు

వ॥ ఈ విధంబుగా రైతుకూలీల పీల్చి పిప్పిచేసిన ధనముతో నీచుడగు జమీందారు భోగవిలాసంబుల కాలము బుచ్చెనెట్లన —

కోడిపందెముకు సారాబుడ్లకు - మేడలు గట్టుటకు
పాడుజేయు నొక కొంత ధనంబును - పాపి జమీందారు
యే పాపం బెరుగని ఆ ప్రజలను - ఇట్లు కష్టపెట్టి
దోపిడి చేసిన ద్రవ్యమంతయును - ధూపానికి రాదు
ఆ రావన భయమొందెడివారికి - ఐక్యత యెట్లుండు?
మారాడక యిటు లొంగి రావునకు - మనుచుండిరివారు
కూలిరైతులకు జమీందారుడన - గుండె లదురుచుండు
చీలదీసి వారందర నాతడు - చాల బాధపెట్టు
ఆ పల్లెకు తలమానికమండీ - హనుమయ్యను రైతు
కోపమెరుంగని సాధుమూర్తి యా - కొద్దిపాటి రైతు
అన్నమ్మనియెడు సుందరాంగి యా - హనుమయ్యకు భార్య
అన్నిట భర్తకు తగినదండి యా - యతివమిన్న కూడ
అన్నిపనుల చేయూతగ నుండును - అతివ పతికి యెపుడు
కొన్నాళ్ళకు ఆయమ్మకు బుట్టిరి - కొమరులు మువ్వురుగ
ముద్దుతీర్చగా పుత్రిక పుట్టెను - ముప్వారి వెనకండి
ఒద్దిక వారికి పెట్టిన పేరులు వరుసగ - వినరండి
పెద్దవాడు నాగయ్య ద్వితీయుడు - భీమయ్యన నొప్ప
ముద్దుగ బెట్టిరి నారాయణుడని - మూడవసుత పేరు
సుగుణంబుల గనియైన కుమార్తెకు - సుమతని పేరిడిరి
నగుమోముల యా బిడ్డల పెంచిరి - నానపాట్లు పడుచు

వ॥ ఆ తల్లిదండ్రులు ఆ పిల్లలను వీధిబడులలో జదివించుచు ముద్దు ముచ్చట జూచుకొనుచుండిరి. సాధుమూర్తులగు నాదంపతులిద్దరును

దినరాత్రములు కష్టించి సుఖ మనునది యెరుగక పిల్లల సాకుచుండిరి. ఇట్లుండ నాగయ్యకు పదునారేండ్ల వయస్సునిండె. అప్పటికాయన—

భాగవతములో కొన్ని పద్దెములు - భారీలెక్కలును
బాగుగ నేర్చెను మానధనుండగు - నాగయ్యప్పటికె
అమర మాంధ్రనామ సంగ్రహంబును - అతడు చదివి వేసి
అమలచరితుండగు అయ్యకుతోడ్పడ - అరక బట్టెనండి
జనకునివలెనే దినరాత్రంబులు - చాకిరి చేయుచును
తన తమ్ముల కాంగ్లము నేర్పించగ - తలచెను నాగయ్య

వ॥ ఇట్లు దలపోసి సుగుణరాసియగు నాగయ్య యెట్లయిన తన తమ్ముల కింగ్లిషు చెప్పించవలెనని బస్తీకి బంపెను. కాని ధన లోపంబున భీమయ్యను మూడవ ఫారమువరకు జదివించి తదుపరి నాపుజేసె. మూడవ ముద్దుల తమ్ముడగు నారాయణుని మాత్రము చదివించుచుండె. తానా గ్రామ రైతు సంఘ ప్రెసిడెంటుగానుండి యా రామాపుర రైతుల తలలోని నాల్కగా మెలంగుచు వారికి ప్రోత్సాహ మిచ్చుచుండె. ఎట్లా—

## కీర్తన

జాగేలనోయ్ - రైతుబాబయ్య
సాగిరావోయ్ వేగనీవు ॥రైతు॥

రైతా ! రయమున రావా !
నీకు రక్షణా, నీ - రైతుసంఘమే
చేరుమందులో నీకు - శ్రేయముగల్గు ॥జాగే॥

ఎండవాన లనక నీవు - రైతుబాబయ్య
పండించినావు పంటలెన్నో - రైతుబాబయ్య ॥జాగే॥

లేరా, లేచిరమ్మురా !
రమ్ము బానిసత్వమున్ బద్దలు సేయ !
పిరికితనము వదలి రైతుపరువు నిలపవోయ్ ॥జాగే॥

వ॥ యీ వార్త చెవినిబడినయంతనే ధూర్తుడగు రామారావు మండిపడి నిప్పులు ద్రొక్కిన కోతివలె నొక నాడా రైతు ఆలమంద నక్రమంబుగా పుల్లరి దొడ్డిలో బెట్టించెను. ఇదియేమి అన్యాయమని వృద్ధుండగు హనుమయ్య యూరి కెడముగానున్న జమీందారుగారి మేడకేగి—

అయ్యా !
అయ్యా వందనమ న్యాయము మా - ఆలమందబట్టి
చయ్యన దొడ్డిన పెట్టించిరి యది - సబబుగాదు తండ్రి
యేమితప్పు జేసితి నీ గతిగా - హింసించగ నన్ను
తా మీగతి కోపించిన మాకిక - దారిలేదు బాబు
అని యెంతో వినయంబుగ బల్కిన - హనుమయ్యను జూచి
ఘనుడగు కొడుకును కంటివి నీకిక - కష్టమేమి కలదు
రైతునాయకుం డైనాడిప్పుడు - రాజగు నికముందు
పాతి వేయుదును జాగ్రత్తగ యిక - బ్రతుకు డంచుబల్కి
బూతులు గూయుచు హనుమయ్యను ఆ - పాతకుండు గెంటె
పూతచరిత్రుడు హనుమయ్యప్పుడు -పుల్లరిచ్చివైచి
గోవుల నింటికి దోలుకవచ్చెను - గుందుచు మదినెంతొ
తనయు లిద్దరును అరకలు విప్పక - జనుదెంచిరి అపుడు
జనకుడు చెప్పగ వినిరి వారలా - జరిగిన కథయంత
వినిరా కథ యచ్చట జేరిన యా - జనసమూహమంత

వ॥ ఇట్టి పని జరిగిన తరువాత మేముండి యేమి ? చచ్చియేమి ? యని దూకులుబెట్టు యుద్రేకపరులగు యువక రైతుబిడ్డల నందర సద్గుణ సంపన్నుండగు నాగయ్య ఆపి ఏమనుచున్నాడనని—

రైతుసంఘమును జూచి యిప్పుడా - రావు మండుచుండె
రైతుల ఐక్యతజూచి రావునకు - రగులుచుండె ఒడలు
పిచ్చి పనులు చేయంగబూనెనూ - భీతి చెంది రావు
రెచ్చి మనము యిపుడాతడు పన్నిన - ఉచ్చునపడరాదు
ఉచ్చులోనబడి రెచ్చినామ మన - కొచ్చితీరు కీడు
ఇచ్చట శాంతిని నెలకొల్పెడు మిష - వచ్చి ప్రభుత్వంబు
అణచజూచు మనలందర గావున - అన్నలార వినుడు
తొణకక బెణకక ఐక్యతగలిగీ - గణుతిగాంచుడయ్య

వ॥ ఇట్లనేక విధంబుల సెప్పి యా రైతుబిడ్డల నందర శాంత బరచి ఇండ్లకంపె. ఆనాడు రైతులందరు నాగయ్య నాయకత్వమున నొక సభజేసి అందు ఆ గర్వియగు జమీందారు జేసిన పనికి యసమ్మతి తీర్మానము చేసి వార్తాపత్రికల కంపిరి. ఇదియంతయు జూచి క్రూర చిత్తుడగు రామారావు రైతు సంఘమునకు కారకుడైన నాగయ్యను సర్వ నాశనము జేయనెంచి—

కోర్టుకీడ్చె నా నాగయ నప్పుడు - కుట్రలెన్నొ పన్ని
పార్టీల్ వారిలొవారికి బెట్టగ - పన్నెను వ్యూహములు
దోయించెను నాగయ్య గృహంబును - దుండగీండ్ల చేత
కోయించెను హనుమయ్య పశువులను - గూడకూడ బాబు

వ॥ ఎన్ని హింసలు పెట్టినను రైతుబిడ్డ నాగయ్య లొంగిరాడయ్యె. ఇది యిట్లుండ మహాసాహసియగు నాగయ్య కనిష్టసోదరుడగు నారాయణ యఫ్. ఏ. చదువుచు మార్క్సు, ఎంగెల్సు మొదలగు ఘనులు వ్రాసిన ఆర్థిక రాజకీయ గ్రంథంబులు సంపాదించి మిక్కిలి యభిరుచిగా జదువుచు రాజకీయ రంగంబున విద్యార్థుల కగ్రగామిగా నుండె. ఆ యువకుడు వేసంగి సెలవులలో యింటికి వచ్చినప్పుడు రామాపురంబున గల తోటి

యువకులకు పాఠశాల పెట్టి సులువగు మార్గంబులో చదువు జెప్పుచు రాజకీయములు వారికి బోధించుచు నభివృద్ధి పరచి యువజన సంఘమును స్థాపించెను. అదియునుంగాక ఆ గ్రామ కూలీ రైతులా వీరయువకుడింటికి వచ్చినప్పుడెల్ల నాతని చుట్టుజేరి, నేటి పరిస్థితు లెట్లున్నవనియు, యుద్ధంబు లెట్లున్నవనియు నడుగుచుండెడివారు. అట్టితరి సూక్ష్మగ్రాహియగు నారాయణ—

ఇటలీ, జర్మని, జపాను, రష్యా - ఇంగ్లండమెరికలు
ఎటుల పాలనము చేయుచుండెనో - ఏది మనకు సుఖమొ
ఇపుడు ప్రభుత్వము ప్రజలనుబెట్టెడి - ఇబ్బందులు యేవొ
విపులంబుగ కడు సులభ భాష నా - వీరుడు బోధించు
బాధ్యత తెలియని ప్రభుత్వంబు - నొక బాటకు దెచ్చుటకు
సాధ్యమౌనుమన కైక్యత కుదిరిన - సత్వరముగ నిపుడె
అని రైతులకూలీల కందరకు - ఆతడు బోధించ
విని వారందరు యాతని మాటల - విలువ తెలిసికొనుచు

వ॥ ఇక ఆ గ్రామవాసులు క్రక్రమంబుగా తమ తమ తగవులనా సాధుమూర్తులగు నాగయ్య, నారాయణుల వద్ద పరిష్కరించుకొని యేకముగాజొచ్చిరి. ఇదియంత జూచి క్రూరుండగు జమీందారు కసివోక, వీని కన్నిటికి కారకుండీతడేనని నాగయ్యను ఖూనీచేయించ జూచుచుండె—

నారిగాడనే కటిక పేద యొక — డూరిలోనగలడు
కోరమీసమూ గజమురొమ్ముగల — కారునలుపువాడు
మెలికలు తిరిగిన తలవెంట్రుకలూ — మెడ బహు కురచండి
కలయబడితె పదిమందినైననూ — గదిమికొట్టగలడు
నారిగాడి పేరంటే హడలా — యూరివారికండి
యేరి యేరి పిలిపించాడండీ - నారిగాణ్ణి రావు

వ॥ కబురు పంపగానే నారిగాడు దివాణానికి వచ్చెను. రామారావు ముందు వానికి ఒక రూపాయి ఇచ్చి దుకాణానికి పంపెను. సారాయి త్రైపెక్కిన నారిగాడు వచ్చి యేమంటున్నాడంటే—

వినిపించండీ దొరలు నన్ను పిలి - పించిన పనియేమి ?
వినరా నారిగ పెద్దపనుండే - పిలిపించా నిన్ను
నేను జెప్పినా పనిజేసితివా - నీకు మాన్యమిస్తా
వేన వేలు ధనమిచ్చెద నిజముగ - వినుము నాదుమాట
దొరగా రెత్తులు తెలియక నాతడు - సరగున బలికెనిటు
దొరల పనులు చేయుటకే పుట్టా — త్వరగా చెప్పండి

వ॥ అప్పుడు కఠినుడగు రామారావు—

నీకు జెప్పెదను నా పని యేమో - నీవు తీర్చవలెర
నా కెదురాడుచు తిరుగుచున్న యా నాగయ్యను బట్టి
ధీరత నీ పిడికత్తికి బలియిడి - పేరు నిలుపుకోర
నారిగాడు ఆ మాట లన్నివిని — నారాయణ యనెను
గాలిలోని యాకో యన్నట్టుల — గజగజ వణికాడు
కాలునిలువకా నారిగాడు తా — కూలిపోయినాడు

## డైలాగ్ (కీర్తన)

నారి : చంపజాలనయ్యా ! నేనా సాధుమూర్తిని ఓ దొర ॥చం॥
పొట్టకూటికొరకు నిటుల — (మి) పూజ్యుండగు
నాగయ్యను పొగరున కనుగానక నే ॥చం॥

రావు : నారిగా యెరుంగ లేవు-నాగయ పొగరూ-ఓరి ॥నా॥
క్రిందుమీదుగాన కతడు —(మి) నన్నెదిరించెను నేడు
దుర్ణయు డతి గర్వంబున ॥నా॥

నారి : కూలిరైతు బిడ్డలకును — కూడుబెట్టగా ఓదొర ॥కూ॥
రాత్రిపగలు గష్టపడుచు (మి) రైతుసంఘము పెట్టి
రక్షించెడు ఆ దొరను ॥చం॥

రావు : రైతు లందరకు నేను — రాజు నిచ్చట ఓరి ॥రైతు॥
నాదు కనుల యెదుటవాడు—(మి) రైతుల సంఘము
పెట్టి రక్షించెడు మొనగాడా ? ॥నా॥

చంప లేను ఆ దొరనండి — నే తందానా తందాన తందస
హరిశ్చంద్రులు ఆ బాబండి "
కోపమెరుంగని గొప్పోరండి "
బూతులురానీ నీతిమంతులు "
బ్రతికుంటే బలుసాకు తిందును "
మాన్యాలొద్దు మరి యేమొద్దూ "
దండం బెడతా సెలవియ్యండి "
అని యన్నాడు గజగజ వణకుచు — ఆ దీనుడు బాబు

వ॥ భయంబున గజగజ వణకు నారిగానిని వెకిలినవ్వు నవ్వుచు రామారావు "మూర్ఖుడా! నీ క్షేమముకోరి నేను చెప్పితిని, కాని వేరుగాదు. నాగయ్య ఎంత దుర్మార్గుడో నీ వెరుంగవ" ని కల్లబొల్లిమాటలు జెప్పి, కొంతవరకు వానినొప్పించెను. తరువాత ఒక నెల రోజుల వరకు సువారంబులో వానిని మేపుచు, త్రాగించుచు, యీ ఘాతుక కృత్యము జేయుటకు, భయంబున నయంబున జెప్పి యొప్పించెను, అంత నొకనాడు నారిగాని పిలిచి ఓరి! నారిగా మూడు దినంబుల నుండి నాగయ్య జొన్న చేనికడ కాపలా పడుకొనుచున్నాడు కాబట్టి—

ఎట్టు లైన నాగయ నీ రాతిరి — మట్టుబెట్టిరార
అట్లుజేయకా వృధాగవస్తివ — హతమార్తుర నిన్ను

చావక నాగయ బ్రతికియుంటె నీ — చావు తప్పదోరి
నీ పీపని నెరవేర్చివచ్చితే — నీకు మాన్యమిత్తు
జాగరూకి వై పోరా నీవని — చాలా బ్రాందినిచ్చి
వేగంబుగ నొక కత్తినిచ్చి తా — సాగనంపెనండి

వ॥ త్రాగిన కైపున నా అవివేకియగు నారిగాడు కష్టజీవి నాగయ్య కాపలాగాయు చేనువద్దకు పోయి ప్రక్కగా పొంచి దాగియుండెను—

నాగయవచ్చి చేనుచుట్టూ — నాల్గుసార్లు తిరిగి
ఆగలేక నిద్రకు పగలంతయు — అలసియున్నకతన
గొంగడిపరుచుక పండుకొనగనే — కునుకుపట్టెనండి
వంగి మెల్ల మెల్లగ నాచోటికి — వచ్చె నారిగాడు
చంప లేక నాగయ్య నాతడూ — సంశయించుచుండె

వ॥ ఇంతలో నా రైతుబిడ్డ మూల్గుచు పొరలెను—

తెంపుజేసి వాడపుడు డొక్కలో — దింపెనండి బాకు
అమ్మయ్యోయని కెవ్వు కెవ్వునా — అరచెను నాగయ్య
చిమ్మకొట్టినా నెత్తుట మునుగుచు — కుమ్మిన బా కొదలి
కాలికొద్దిగా వురికెను వాడా — కటికి చీకటందు
జాలిగ అరచిన నాగయ యరపును — చేలవద్ద రైతుల్
విని వారందరు పరుగునజని యట — కనిరా నాగ్యయ్యన్
కని దుఃఖముతో చేరిరి వారా — ఘనుని చుట్టునపుడు
వేరొక చేనును గాయుచు భీమయ — వినెను అన్నయరపు
దారి డొంక లేకుండ వురికి చని — తన యన్ననుజూచి
ఏమి పాపమిది అన్నాయని యత—డేడ్వ జొచ్చెనండి
రామరామయని యేడ్వజొచ్చిరా — రామాపుర ప్రజలు

వ॥ అప్పుడు నాగయ్య వారి నందర చే సైగతో నాపి ఏమను చున్నాడనిన—

మిత్రులార మన రైతుసంఘమును — మీరెటు బ్రోచెదరో
శత్రువు దీనిని నాశము చేయగ — జాల ప్రయత్నించు
యింతకుమించిన ఘోరము లాతడు — యెన్నొ చేయగలడు
చిన్నవారలౌ నాదుసోదరులు — జేసెడి తప్పులను
మన్నించగ మిము వేడుచుంటి నా — కున్న కోర్కెలివియె
అనిన ధీరుడగు నాగయమాటల — నాలకించి వారు
అనఘా నీదగు కోర్కెలు దీర్చెద — మనిరి చింతదోడ

వ॥ నీ కోర్కె లన్నిటిని, స్థితిగతు లన్నింటికి కట్టుబడియుండి ఓపికతో మేము తప్పక తీర్చెదమనిన రైతుల మాటలకు ఆ వీరుడు సంతోషించి తన తమ్ముడగు భీమయ్యను దగ్గరకు పిలిచి, తమ్ముడా—

అమలచరితులగు అమ్మను అయ్యను — ఆదరముగ చూడు
సుమతిని నారాయణు నేతీరున — చూతువొ భీమయ్యా
మిమ్ముల బెంచెడి భాగ్యము నాకిక — తమ్ముడ లేదోయి
అమ్మకు నాన్నకు నాదు వందనము — లందించర పోయి

వ॥ అని ఏకధారగా కన్నీరు గార్చుచు చెంతనున్న తమ్మునకు జెప్పి బాధ భరించలేక డొక్కలోనున్న బాకును తానే లాగివైచికొనెను. అప్పుడు—

విలవిల తన్నుక నాగయజీవుడు — వెళ్ళిపోయెనండి
జలజల కన్నుల జలముకారెనా — జనసమూహమునకు

వ॥ తరువాత నా రైతులు మహా దుఃఖమున దమ నాయకుని శవంబు నింటికి మోసుకొని వచ్చిరి. ఆ గ్రామ మా బాలగోపాలము పిడుగువంటి యీ వార్తవిని పరుగుపరుగునవచ్చి, ఆ దురదృష్టవంతుడగు హనుమయ్య యిల్లు సిండిరి. యింటివారందరా శవంబుపైబడి గొల్లున నేడ్చుచు—

కొడుకా కొడుకా యని యావృద్ధులు — గొల్లున నేడ్చుచును
నడి సముద్రమున మమ్ము ముంచితివ — నాగయ్యా నీవు
అన్నమ దుఃఖము యింతని వ్రాయుట — కలివిగాదు బాబు
అన్నబట్టె నా యమ్మ ప్రాణములు — అడలి యడలియేడ్వ
వాగుగ పారెను హనుమయ కన్నీర్ — వర్ణింపగతరమ
నాగయ్యా ! మా కేమిజూపి నీ వేగినావు తండ్రి
యెంత జేసెరా జమీందారని — యేడ్చెను హనుమయ్య
అంతెకాల మరుదెంచె రావు కని — రా జనులందరును
శోకము సుమతీ భీమయ్యల దిక — జూడలేము బాబు
కాకిగోలగా యేడ్చిరి సోదరు — కాళ్ళపైన పొరలి

వ॥ తరువాత యానాటి సాయంత్రమునకు శవ పరీక్ష వగైరాలు జరిగిన తరువాత శవదహనంబయ్యె మహా దురాగతుడగు జమీందారు ప్రజల రక్తము పీల్చి పిప్పిజేసి గడించిన ద్రవ్యము గుమ్మరించి కేసు తప్పించుకొనెను. మరునాటికి నారాయణరావు యీ దుర్వార్త విని యింటి కరుదెంచి—

అన్నా నాన్నా అమ్మా చెల్లీ — అన్న యేడె యనెను
అన్నమ్మప్పుడు కొడుకును చుట్టుక — అన్న దాటె ననెను

వ॥ అప్పుడు నారాయణ —

దేవుడువుంటే మా యన్నకు యీ — చావురాదు తల్లీ
చావురాదు మా యన్నకు మనలో — సఖ్యతయేయుంటె
ఘనుడాయన తల పెట్టిన కార్యము — కడతేర్చకపోతె
అనుజుడగా నాయన్నకు నేనని — యనె నారాయణుడు
సుమతివచ్చి చిన్నన్న కాళ్ళకూ — చుట్టుకొనియెనండి
కుమిలుచు నారాయణుడు సుమతితల— నిమురుచు బలికెనిటుల

అన్నకు ప్రజలను ఐక్యముజేసే - ఆలోచనగలదు
చిన్నతల్లి మనము తీర్చవలయునె - అన్నకోరి కనెను

వ॥ రాజకీయ చైతన్యం బొందిన యీ నారాయణరావు యఫ్.ఏ. చదువును మానుకోవలసి వచ్చెను. ఆ యువకుడు వచ్చిన రోజుననే రామాపుర రైతు లోకసభ చేసిరి. అందు ప్రేటుబడ్డ ఆ రైతు సింహము లుద్రేకులై యేమను చున్నారనిన—

భళాభళానోయి తమ్ముడా - సై మేలు భళానోయ్ దాదానా
సోదరులారా రండిర ॥సై॥
చూడలేము యీ హత్యలు ,,
క్రూరుడు మన నాగయ్యను ,,
కూల్చి కులుకుచున్నాడుర ,,
మన కష్టముతో నీచుడు ,,
ఘనమగు మేడలు గట్టెర ,,
మనగతి యేమో చూడర ,,
తినగా తిండి లేదా యే ॥భళా॥
నాగయ్యను హతమార్చిన ॥సై॥
నరహంతకుడీ నీచుని ,,
గోరీకట్టగ నిప్పుడె ,,
వీరులార లేలెండిర ,,
చావుకు రెండూచావులు ,,
లేవీ ధారుణి రండిర ,,
వేడి రక్తమది యుండినా ,,
వీరు లందరును రండయ్యా ॥భాళా॥

వ॥ అని తోకతొక్కిన త్రాచువలె లేచి మండిపడు నా రైతు యువక సింగంబుల దూరదర్శియగు నారాయణు డాపుజేసి సోదరులారా!

# కీ ర్తన

ప॥ ఓ యన్నా ! వినుడు

అ॥ నా విన్నపం బొకటి యోర్పుతోడ

చ॥ కన్ను మిన్నుగానక ధూర్తుం డత
డన్న నతిక్రూరముగ జంపించె
నన్న కోపమున వాని గూల్చితిమ
ఆపై మనకే ముప్పు గల్గు ॥నో॥

1. తగదన్న — తాత్కాలిక క్రోధం బెన్న
చెడిరన్న యెందరో మున్ను
వీరయోధు లెందరో ప్రాణముల
ధారబోసిరీ దేశంబుకై
దారితప్పి పెడదారిం బోయిన
దాన ఫలము లభియింపదుగ

ఆలోచించక యీ పనిజేసిన — హానికలుగు మనకె
కాలమెరుంగక జేసిన కార్యము — కష్టము దెస్తుంది
ముక్తిగలుగదీ తీరున మన మొక — వ్యక్తిని హింసింప
శక్తిజూపి మనమిప్పుడు ఐక్యత — సాధించగవలయు
యిప్పుడు మనమా పరమ కిరాతుని — హింసించిన యెడల
తప్పక ముప్పు ఘటిల్లును మనకో — తండ్రులార వినుడు
మనవలె తాత్కాలిక క్రోధంబున — మండి యెంతో మంది
అనఘులు దేశంబునకై ప్రాణము — లర్పించిరిగాని
అందువలన యావంతఫలితమూ — అన్నలారలేదు
సందేహములే దిట్టి కార్యములు — సఫలము కావయ్యా
దారిదప్పినా దేశభక్తులీ — తప్పు తెలుసుకొనుచు

సరియగు మార్గంబును గుర్తింతురు — సంశయించవలదు
జనసంఘంబును కూడదీయకయె — జరగవు మనపనులు
పని నెరవేరదు వ్యక్తిహింసలతో — బాగుగ తెలియండి
అని యెన్నో సంగతు లుపమానము — అప్పుడు బోధించి
మనుజహంతకుడు యీతని గెల్చెడి — మార్గము వేరంచు
నారాయణు డీ తీరున యెన్నో — దారుల బోధించి
వీరావేశం బెక్కినవారిని — దారికి తెచ్చాడు

వ॥ కొంతకాలము మీ రోపికబట్టి యుండుడని అనేక ఉదాహరణలు చెప్పి ఆ దేశసేవాదురంధరుడగు నారాయణుడు తన యుపన్యాసమును ముగించెను. స్పష్టమగు యాతని మాటల యందలి నిజంబును గ్రహించి ప్రజలేకము గాజొచ్చిరి. నారాయణ భీమయ్యలిద్దరు తమ యాస్తిని కొంత పోకడబెట్టి ఋణవిముక్తి జేసికొనిరి. ఆ వీరవరేణ్యులగు నారాయణు డూరూరు తిరిగి ఐక్యతా ప్రచారముజేయ మొదలు పెట్టెను. కథ యిట్లుండ నారిగానికి కొండంత యాశబెట్టి యిట్టి దారుణ కృత్యము జేయించిన మహా ద్రోహియగు జమీందారు వానికొక్క రాగిడబ్బుకూడ నివ్వలేదు. తిరిగి తిరిగి విసిగి వేసారి నారిగా డూరకుండెను. ఇట్లుండ కొన్నాళ్ళకా దౌర్భాగ్యుని భార్య ప్రసవించలేక మూడునాళ్ళ నుండి విపరీతంబగు బాధ ననుభవించుచుండె. అప్పుడా పరమదరిద్రుడగు నారిగాడు దరి దోచక జమీందారు వద్దకు పరుగెత్తి—

దొరలను నమ్మిన వాడను నన్నొక — దరిజేర్చాలండి
తరముగాదు వర్ణింప లచ్చిబడు — దరిదోచని బాధ
మూడుదినంబుల నుండి యదిబడే — పీడ చూడలేను
కూడులేదు నా పిల్లలిద్దరికి — మూడునాళ్ళ నుండి
కనజాలక యదిబడెడి శోకమూ — కాకిశోకమండి
కనికరించి పదిరూకలిస్తిరా — గట్టెక్కెదనండి

గండము దాటించండి మీకు నే — దండము పెడతాను
అండజేరి మిమ్మెప్పుడు కాచుక — యుండువాడనండి
ఆదరించి నను బ్రోతురనుచు నే — నరుగుదెంచి తనగ
ఆ దరిద్రుడగు నారిగాని మా — టాలకించి రావు
నీతిహీనుడా దాచినావ నీ — తాతగాడిముల్లె
పాతరలేదుర తవ్వియిచ్చుటకు — పశువా నీ కిచట
తింటివి యిదివరకొక నెల నీవిట — యింటికుక్కవోలె
అంటరాని నీజాతి వారలను — హరిహరి యనరాదు
పోరా కుక్కా నీ కేసుకు నే — పోసినార వేలు
నోరుమూసుకొని పోరా నీచా — మారాతక యనెను
ఆ రీతిని రామారావనగా — నారిగాడు మండి
భారీ దొరలని నమ్మి మిమ్ములను — భంగపడితినండి
కూటికి పేదనుగాని మీకువలె — మాటదప్పనండి
మేటి రైతుబిడ్డను జంపితినే — మాటనమ్మి మీది
అందరి రైతుల వదలుకొంటి మీ — అండదొరికెనంచు
తొందరగానే బుద్ధిజెప్పితిరి — దొడ్డదొరలు గనుక
అనుచు నారిగా డతితొందరగా — వెనుకకు దిరిగాడు
అనువుజూచి రామారావప్పుడు — తనదగ్గరనున్న
బరువగు సారాబుడ్డి విసరియా — దురితాత్ముడుగొట్టె
గిరగిర తిరుగుచు పోయితగిలెనా — దరిద్రు తల కదియు
నారాయణ నారాయణ యంటూ — నారిగాడు వొరిగె
కారెను తలనుం డప్పుడు నెత్తురు — కడవలాదిగాను

వ॥ అప్పుడప్పురమ కిరాతుండగు రామారావా నారిగానిని గేటు బైటకు నెట్టించి తలుపులేయించె. ఈ యుదంత మిట్లుండ నక్కడ దిక్కులేని యా నారిగాని భార్య వేదన భరింపజాలక గోలగోలగా నేడ్వజొచ్చె. అంత చుట్టుపట్లనున్న కూలివాండ్లందరు గుమిగూడి దారి దోచక నారిగా డెక్కడున్నాడో తీసికొని రండని కొందరి నంపిరి. ఇంతలో ప్రక్క యూరు బోయి రైతుయువకులతో మాట్లాడి వచ్చుచున్న నిరంతర సేవాతత్పరుడగు నారాయణుడా దారిని వచ్చుచు ఆ దౌర్భాగ్యు రాలి గోల విని పోయిచూచి మామూలుగా పల్లెటూళ్ళలో తాత్కాలిక బాధ నుపశమింపజేయుటకు తనవద్ద నుంచుకొనిన మందులువాడి ఆ దీనురాలికి సేవజేయుచుండెను. ఈ కధ ఇట్లుండ యిక నచ్చట నారిగాడు తెప్పరిల్లి—

తూలుచు తుళ్లుచు కొంపజేరుకొని — కూలబడియెవాడు
చాలాబాధతొ మూల్గుచు నాతడు — నేలకొరిగెనండి
నారాయణు డదిజూచి వేగమున — నారిగానిజేరి
ధారధారలుగ కారిన నెత్తురు — తక్షణమే కడిగి
గాయంబునకొాక యాకుదెచ్చి తా — కట్టుకట్టెనండి
నాయనయంటూ కన్నులు దెరచెను — నారిగాడుబాబు
సేవజేయు నారాయణు నెగదిగ — చింతించుచుజూచి
చావనున్న నను లేవగనెత్తిన — దేవుడ దండమని
కాళ్ళుపట్టుకొని వదలక నాతడు — కళ్ళనీళ్ళ కడిగి
రాళ్ళు కరగగా నేడ్చుచు పలికెను — రైతుబిడ్డతోను
కన్నతండ్రి మీ యన్నను జంపిన — కఠినుడనౌ నాకు
ఇన్ని విధంబుల సేవలు జేస్తిరి — యేమనందు తండ్రి

అని యల్లాడుచు కాళ్లపట్టుకొని — యా దీనుం డడల
చనువుగ లేపుచు నారాయణు డనె — కనులనీళ్ళు నింపి
నీదిగాదు యీతప్పు యెవరిదో — నీ వెరుంగవోయి
నీ దరిద్రదేవత చేయించెను — నీచే యీ పనిని
మోసగించి మిము నాశముజేసే — మోసగాండ్రు వేరు
ఈ సమయంబునగాదు జెప్పుదును — ఈ కథ నికముందు

వ॥ అని చెప్పి ఆ దీనుడగు నారిగాని చేయిపట్టుకొని అతని భార్య మంచముకడకు తీసుకొనిపోయెను. అక్కడ కుక్కిమంచమునబడి లేవ లేని లచ్చి కండ్ల నీరు నింపుచు తన మంచముకడ నకనకలాడుచు నిల బడియున్న పిల్లలిద్దరిని పిలిచి నారిగాని కొప్పగించి—

పిల్లోళ్ళిద్దరు యెట్లు పెంచెదవో — వెళ్ళిపోవుచుంటి
కళ్ళు తెరవని పసికూనలనూ — కష్టబెట్టబోకు
మన కిద్దరకును పెండిలి జరిగిన — మరుక్షణంబు నుండి
తినియెరుంగ మీ పిల్లలు మనమును — తిండిపొట్టనిండ
దొరల నమ్ముకొని తెచ్చుకుంటివా — దొడ్డఫలిత మీపు
దొరల పంచలకు జేరక తిరుగుము — సరిసమానులందు
అనియెడు భార్యనుజూచి నారిగా — డడలుచు బలికె నిటు
తనువుండగ నీ మాటలు మరువను — నను నమ్మవె లచ్చి

వ॥ అని నీళ్ళు గుడ్ల గ్రుక్కుకొని దీనుండగు నారిగాడు లచ్చి నోదార్చెను. దయామయుండగు నారాయణుండా యతివకు ధైర్యము జెప్పుచు మరల మందు త్రాగించెను. మందు ప్రభావంబున ఆ నిర్భాగ్యు రాలు ప్రసవించెను. కాని మూడు దినంబుల నుండి మితిలేని బాధపడుట చేతను, ఆహారము సరిగ్గ లేకపోవుటచేతను, ప్రసవించుటచేతనె, పేదల

కాధారములేని యీ పాడులోకంబును విడచి యామె వెళ్ళిపోయెను. ఆ పుట్టిన పసిగందు పాలుదొరకక, మిగతా పిల్లలిద్దరు తిండిదొరకక, ఆదరించువారులేక బాధపడుచుండిరి. దీనికంతకు తన ప్రవర్తనయే కారణమని నారిగాడు గ్రహించి యేమని విలపించుచున్నాడనిన—

## కీర్తన

1. అకటా యెంత తప్పు - అన్నా జేసితినీ ॥అకటా॥
రైతులందర విడచి రావు దొరనునమ్మి

2. ఘనుడునాగయ దొరను పొగరున కన్నుగానక
చంపినేనిపు
డన్ని విధముల పక్షినైతిని ఆదరించరు
ఎవ్వరయయో ॥అకటా॥

3. ఘనుడౌ నాగయ్యాను — కడతేర్చినా ఫలము
కట్టికుడుపుచుండె — గతియేమి నా కిపుడు
కులపు వాళ్ళందరును నన్నొక — క్రూరకర్ముడనని
తలంచుచు
దరికి జేరగనీయ కిప్పుడు తరిమి తరిమి — కొట్టసాగిరి
॥అకటా॥

4. కన్నబిడ్డలు నేడు — అన్నార్తులై యేడ్వ
పట్టెడన్నముబెట్టి — బ్రతికించు కోనోచ
అండదొరికెను దొరదెయని నే నదరిపడి తుదకిట్లులైతి
పాలులేవా ! బిడ్డకనినన్ — పలుకరించరు
కూలిరైతులు ॥అకటా॥

5. నాకు దారిజూపి నన్ను బ్రోచే దెవరు
నారాయణబాబు నన్ను దరిజేర్చాలి
అన్నగారిని జంపినాడీ యధముడని మదిదలచకా ఘను
డెన్నొ సేవలుజేసెనే డాపన్ను నను దయజూడ
కుండునా ॥అకటా॥

వ॥ పాపమా పసిబాల పాలుదొరకక పోషించు దిక్కూలేక మరణించెను. అంత నారిగాడు పేరుండగు నారాయణదప్ప తనకొక దారిజూపువారు లేరని ఆ ఘనుని వద్దకు జేరెను. సుగుణరాశియగు నారాయణ వానికొక బుర్రకథ నేర్పెను. వాడా కథ జెప్పుచు. కూలీల నైక్యపరచ మొదలుపెట్టెను.

కాలంబెరుగక కష్టంజేసె — తందానా తందాన తందన
కూటికిలేని — కూలన్నలారా ,,
సాటివాణ్ణి నా — మాటలు వినుడీ ,,
భూఖామందుల — బూటకాలు విని ,,
మోసపోతిమా — మునిగిపోతము ,,
అనుభవించి - నే జెప్పేమాటలు — ఆలకించుడయ్యా
మాన్య మిస్త్రమని — మాడ లిస్త్రమని —
తందానా తందాన తందన
చేయరానిపని — చేయించెదరూ ,,
తేనెలుగురిసే — తియ్యనిమాటల ,,
మచ్చుజల్లి మటు — మాయలు జేసి ,,
రైతుకూలికీ లడాయిబెట్టి — రాజ్యమేలుతారు ,,

కూలీరైతులు — కూడుగుడ్డలూ — తందానా తందాన తందన
దొరకక చచ్చేడి — కరువురోజులూ ,,
కనబడుచున్నవి — కళ్ళకు యిపుడూ ,,
కూలీరైతులు — కూడియుండకా ,,
విడిబడియుంటే నిశ్చయంబుగా — చెడిపోతామోయి

వ॥ ఈ విధంబుగా ఒక్కచిక్కి మురికి దారంబుల వలెనున్న తన కూతురును. కుమారుని భుజములపై నెక్కించుకొని విధివిరామము లేకుండ రేబవలును విచక్షణలేక, దీక్షాకంకణుండై నారిగా దైక్యతా ప్రచారము జేయుచుండె. వాడేగిన ప్రతి పల్లెలోను కూలీలు గుంపులు గుంపులుగా గుమిగూడి ఐక్యపోరాట ప్రచారము శ్రద్ధగా విన నారంభించిరి. మహాత్యాగియగు నారాయణుడు రైతులోకంబు నంత తన తియ్యని పాటలతోను. గంభీరోపన్యాసములతోను న్ఫూర్తి లూపుచుండె. యిక భీమయ్య—

పాలుపొలంబును దున్నుచు నెప్పుడు — బాడుగ దోలుచును
కాలమెరుంగక కష్టముజేయుచు — కండలు కరిగించి
భీమబలుండగు భీమయ తనదగు — పేదకుటుంబమును
ధీమాగా పోషించుచు నుండెను — తీరికయేలేక

వ॥ ఇట్లుండ నొకనాడు భీమయ్య బస్తీకి బాడుగబండి తోలుకొని వెళ్ళె. కొడుకు బోయిన చీకుతోడ సగమైన వృద్ధుడు హనుమయ్య జొన్న చేను కాపలాకు వెళ్ళెను.

సుందరాంగి నవయౌవనవతియగు — సుమతాదినమందు
పెందలకడనే వంటజేసుకొని — బిరబిర తానపుడు

కొడుకు చీకుతో మంచముపట్టుక - కడువేదనతోడ
పడియుండిన తన తల్లికి మెతుకులు - పట్టెడన్ని పెట్టి
తాను వేగమున కుడిచి యింత తన - తండ్రికి తీసికొని
చేనుకు రయమున బోవుచున్నయా - చిగురుబోడినపుడు

వ॥ మేడపై పచారుచేయుచు నా మేడ క్రిందుగా మెరుపుతీగయో యన తండ్రికి వేళదప్పెనని అతిరయంబునబోవు సుమతి నా పరమ క్రూరుడగు జమీందారు కన్నులజూచి ఆ కలికి యందచందంబుల కచ్చెరు వంది నౌకరగు సుబ్బయ్యను పిలిచి—

పున్నమచంద్రుని ధిక్కరించు యా - పువ్వుబోడి యెవరు
యెన్నడు జూచియెరుంగను నేనీ - చిన్నదాని ననిన
అందంబులగని యామె నెరుంగర - హనుమయ బిడ్డండి
యెందరొ కాంతలుగలరు గాని యిట - యీపె బోలరండి
ఆ మాటలువిని రామారా వనె - అరరే సుబ్బన్న
రామారావునుగాదుర నేనీ - రమణి బట్టకుంటె
ఎట్టులైనగానిమ్ము నేడు యీ - పిట్టను బట్టాలి
పట్టకుంటె యీ చిన్నదాని నే - బుట్టిన ఫలమేమి

వ॥ అని కామాతురుడగు జమీందారు క్రిందుమీద గానక నెట్టులైన సుగుణరాశియగు సుమతిని జెరబట్ట నుచ్చులు పన్నుచుండె. ఈ యుదంత మిట్లుండ — నా కోమలాంగి శరవేగంబున జని వయోవృద్ధుడగు తన తండ్రి కన్నమందించె. కష్టజీవియగు నా రైతు భోజనముజేసి తన పుత్రికారత్నమగు సుమతితో తల్లీ ! నీయన్నభీమయ్య బండితోలుకొని బస్తీకి వెళ్ళెను. సాయంత్రమువరకు రాడుగాన నీవుచేనుగాయుచుండుము. నేను యెద్దులకు గడ్డిగోతునని చెప్పి ప్రక్కచేనికి పోయె. అంత—

హనుమయవచ్చి పుత్రికతో ననె - అమ్మ సుమతి వినుము
ఇనుడు గ్రుంకె త్వరితంబుగ నీ విపు - డింటికేగుమమ్మ
వెనుక ముందుగా నేను వచ్చెదను - వెళ్ళు మమ్మనీవు
మనకు సుఖపడే గీతయుంటే యీ - వెనుదుఃఖమురాదు

వ॥ అని సుగుణరాశియగు తన కూతునంపి యా ముదుసలి సందె కాపలా కాయుచుండె. అచ్చట పరమ కిరాతుండగు జమీందారు సర్వకాల సర్వావస్థలయందు తన వెన్నుగాచుకొనివుండి యెట్టి పాపకార్యముకైనను వెరువక కాలకింకరులో యనదగు నలుగురు దుండగీండ్రతో కూడి తన మేడ ప్రక్కనున్న చిట్టడవిలోకి షికారను మిషతో బోయి ఆ బాలా మణి రాక కెదురు చూచుచుండెను—

పరుగున కనుచీకటిలో వచ్చెడి - బాలామణి గాంచి
దురిత కర్ములట బొంచియుండి - యా తరుణిపైన దూకి
అరచుచున్న యా సరసిజలోచన - నదిమిపట్టినారు
కరములు కాళ్ళను నోరు గట్టిగా - గట్టసాగిరండి

వ॥ యిచ్చట నిట్లుండ నిక నచ్చట —

యేన్కుగ్రుంకు వేళకు భీమయ తన యింటికి జనుదెంచె
లోనికి పుత్రుడు రాగనె యన్నమ - దీనముగా బలికె
నాయన నీ జనకుండు చెల్లియును - సాయంతనమైన
యే యవాంతరము గలిగెనో యింతకు - యింటికి రాలేదు
తొందరగా నీవేగి వారలను - తోడుకరమ్మనిన
యెందుచేత నబ్బాయని భీమయ - తొందరగానపుడు

వ॥ నే నిప్పుడే బోయి వారిని తోడుకొని వత్తునమ్మాయని చెప్పి మూలనున్న లాఠీకర్ర చేతబట్టుకొని మహావేగమున చేనివద్దకు బోవుచు దారిలో దుర్మార్గులగు నా దుండగీంద్ర చే జిక్కిన తన చెల్లెలి యరపు విని యేదియో ముప్పు సంభవించినదని యతిరయంబున బరుగిడిబోయి కాలుసేతులు బంధింపబడుచున్న తన చెల్లెలి యవస్థ దూరంబునుండియే జూచి——

దెబ్బతిన్న బెబ్బులి చందంబున - బొబ్బలు బెట్టుచును
గొబ్బున దుర్మార్గా జచ్చితివని - కొట్టెను సుబ్బన్నన్
గిరగిర దిరుగుచు దెబ్బకు గూలెను - ధరణిపైనవాడు
బిరబిర నలుగురు జట్టీలప్పుడు - భీమయ్యపై బడిరి
మండుచు భీమయ మహాకోపమున - మరియిద్దరి గొట్ట
గుండా యొక్కడు భీమయ నప్పుడు - గొట్టెనొక్క దెబ్బ

వ॥ దెబ్బతగిలిన భీమయ్య రక్తంబున మునిగి తేలుచు యోరి కిరాతులారా ! నా బొందిలో ప్రాణంబులుండ మిమ్ముల వదలనని అరిచి కేక వేసిన నా మహావీరుడగు భీమయ్య యరపు వేరొక గ్రామంబున బుర్రకథ జెప్పి తన పిల్లలిద్దర భుజంబులపై నెక్కించుకొని వచ్చుచున్న నారిగాడు విని పిల్లలిద్దర దింపి భీమయ్యగారి కేదియో కీడుమూడినదని పరుగు పరగున వచ్చుచు——

పొదచాటున గూర్చుండి తుపాకిని - వదలజూచుచున్న
మదమత్తుండగు రామారావును - అతడు కనులజూచి
పరుగు పరుగునా వచ్చి కొట్టెనూ - పరమ కిరాతుణ్ణి
విరిగె తూపాకియుగూడయు దెబ్బకె - ఒరిగె జమీందారు

పారిపోకుడో నీచులారయని - పరుగున వస్తున్న
నారిగాని నా కిరాతులుగని - పారిపోవుచుండ
తరిమికొట్టిరా యిరువురు వీరులు - పరమకిరాతులను
తిరిగిచూడక వురికిరి నీచులు - దివాణంబువరకు

వ॥ అట్టితరి నీచాతినీచుండగు రామారావు విరిగిన గూడ వ్రేలవైచుకొని పొదలచాటుగా రొప్పుచు రోజుచు పరుగిడిపోయి దొడ్డి దారిని తనమేడలో దూరెను. కొంత దూరమా నీచులదరిమి తిరిగి మహా వేగమున వచ్చి చెల్లెలి కట్లన్నియు విప్పుచు ప్రళయకాల మార్తాండుని వోలె మండుచున్న భీమయ్య చెంతకు లేళ్ళగుంపును చెల్లాచెదరు జేసి వచ్చు బెబ్బులి చందంబున నారిగాడు వచ్చి రక్తసిక్తాంగుడగు నా వీరుని తలకు కట్టుకట్టెను ఇంతలో నారిగాని పిల్లలిద్దరు నచ్చటికి జేరిరి. ఆ వీరు లిద్దరును భయంబున గడగడ వణకుచున్న సుగుణరాశియగు సుమతికి భయంబుబాపి సేదదీర్చి యింటికి తీసికొనివచ్చిరి. ఈ వార్త చెవిని బడిన యంతనే గ్రామవాసులందరు పరుగున వచ్చిజూచి మండుచు యా నీచుడగు జమీందారును మేడతోసహా నాశనముజేసి గాల్చివత్తమని బయలు దేరిరి. అట్టితరి అప్పుడే యింటికి వచ్చిన దూరదర్శియగు నారాయణుడు వారినాపి—

అన్నలారా తొందరపడకండి - ఆలోచించండి
కన్నుగానకా నీచుడు జేసిన - ఘాతుకంబుగాంచి
కోపంబున మన మా నీచాత్ముని - గూల్చివచ్చినామ
పాపంబంతయు మన నెత్తినసనే - మోపెద రాపైన
యీపూటకు మీ రోపికపట్టుడు - రేపుజూతమంచు
ఆపెను రైతుల మహాకష్టమున - ఆ వీరుండపుడు

వ॥ మరునాడు జమీందారు పోలీసులకు లంచమిచ్చి రాత్రిపూట దొమ్మీగా మా యింటిపైబడి కొట్టిపోయారని నేర మారోపింపజేసి భీమయ్యను, నారిగానిని అరెస్టు జేయించెను. అప్పుడు నారాయణరావు ప్రజల నేమని యుద్బోధించుచున్నాడనిన—

## కీర్తన

కదలండీ ! ఘనులార మీదగుశక్తిజూపగ ॥కద॥
నేలయీనినపగిది ఇప్పుడు
కూలిరైతులు వేలకొలదిగ
వీరులగు మన సోదరుల విడి
పింప బారులుదీర్చి వేగమె ॥కద॥

యువకులు, యువతులు, పిల్లలు, తల్లులూ
జయజయ ధ్వనులతో
కదిలి దిక్కులు పిక్కటిల-శరవేగమున సోదరుల గావగ ॥కద॥

సాధుమూర్తులగు కార్మిక కర్షక - యోధులార వినుడి
బాధాకరమగు యీ కథ నంతయు - పరికించండయ్యా
కంటకు లందరు మన సోదరులను - గెంటిరి ఖైదునకు
ఉంటే ఐక్యత బీద లందరికి - వెంటనె కదలండి
అందరు ముందుకుసాగి ప్రభుత్వము - కర్జీలనుబెట్టి
వందలాదిగా నిరసన సభలను - అందరు జరపండి
జనులందరుజని గవర్నమెంటుకు - జరిగిన కథజెప్పి
మన సోదరులను విడిపించండి - ఘనులారాయనుచు

వ॥ ఈ విధముగా యా వీరుడు ఊరూరు తిరిగి ప్రజలకు చెప్పుచుండెను. సుగుణవతియు, నభిమానవతియునగు సుమతి నావలె యెంత మంది స్త్రీలు నీచులగు జమీందారుల దారుణ కృత్యంబులకు గురియగుచున్నారోయని కూడా తన యన్నతోపాటు నడుము బిగించి స్త్రీల నుద్బోధించి—

అక్కయ్యలారా అమ్మలారా యీ తందానా తందాన తందన
నీచ కార్యమును చూచినారుగా ,,
రోషమున్న యీ ఘోషావదలి ,,
ఊరూరుకు యీ వార్తలు తెలిపి ,,
పురుషులకంటెను ముందుకు దూకి పరువు నిలుపుడమ్మా

మానవకోటికి మనమె సగంబు తందానా తందాన తందన
సగము సంఘ మిటు చాటునయుంటె ,,
నేటి కష్టములు దాట లేముగా ,,
మానముబోయిన మన మెందులకు ,,
సంకెళ్ళన్నీ తెంచుక మీరలు సాగిరండు తల్లీ ,,

మానముగాచిన మన సోదరులను తందానా తందాస తందన
ధనబలంబుతో తరిమిరి జైలుకు ,,
జనబలంబుతో ఘనుల నిద్దరిని ,,
బయటికి తెచ్చే బాధ్యత మనదే ,,
కావున మనమే ముందడు గేసి కాపాడాలండో ,,

వ॥ వీరులగు నా సోదర సోదరీమణులా పిల్వాదరించి కూలీ రైతు లోకంబునంగల స్త్రీ పురుష లొక్కుమ్మడి సభలుజేసి మహజర్లు పెట్టి

గవర్నమెంటు వద్దకు పోయి పెద్ద యాందోళనజేసిరి. ఈ ప్రజాఐక్యతా బలంబునకు తట్టుకొనలేక ప్రభుత్వమా పీరుల నిద్దరవిడిచి, కపటిజమీం దారును, ఆ నల్గురు దుండగీంద్రను అరెస్టు చేసెను. కాని ధనబలంబు చేతను, పెద్దపెద్ద సిఫారసుల వలనను, చావుదప్పి క్రూరుడగు రామారావు తానొక్కడే బయటబడెను. ఆ రామాపుర రైతులు నాటి నుండి జమీం దారునకు అతని నౌకరులకు యిచ్చు అక్రమ మామూళ్ళన్నియు ఇవ్వ మానివైచేరి.

యెట్టి పనున్నాగాని రైతులు — వెట్టికి దున్నాలి
అట్టి నీచమగు యాచారంబును - మట్టినిగలిపారు
ఊరు కానుకొని జమీందారున — కున్నతోటలోన
చేరిచి పశువుల నన్నిటి పెంటల — నూరకగట్టాలి
కంటక ప్రదమగు నీపనులన్నిటి — మంటగలిపినారు
ఇంటికొక్క బండెరువు చొప్పున - యివ్వరువారిపుడు
కూలీలబెట్టెడు బాధలు గలవిక - కోట్లకొలదిగాను
జాలియెరుంగని యా నీచాత్ముడు - కాలరాయువారి
తతిమ్మ రైతులు మానెడిచ్చితే - తాను సోలెడిచ్చు
గతులు లేవు కూలీలకు వానికి - వ్యతిరేకము చేస్తే
పలురకంబుల పుగాకుతోటలు - గలవు రావు కండి
పిలకతీయ నా తోటలలోనికి - పిల్లల పంపాలి
పిల్లల కివ్వడు జమీందారు డొక - చిల్లిగవ్వ కూడ
కల్లగాదు తొలికాపునగాచిన - కాయలు పంపాలి
రోజూ వంతు ప్రకారం కూలీల్ - తా జాగడ్డండి
రాజావారి గుర్రాలమంద్ధకు - రఖాణా చెయ్యాలి

కాలేకడుపుతో గడ్డి తెచ్చి మరి - కూలీ కదలాలి
తేలేనన్నా రాలేనన్నా - తిప్పలు తప్పవిక
మానిరి హలీల్ రైతులందరీ - హీనకార్యములను
దానవుడగు నా రావు కప్పుడు - దరితోచగలేదు

వ॥ అప్పు డప్పరమ నీచాత్ముడగు జమీందారు రామారావు పిచ్చి యెత్తిన కోతివలె ఆ గ్రామంబున చుట్టూ తనకున్న పొలములలో నుండి మామూలుగా బండ్లు, మనుష్యులు వచ్చు బాటలన్నిటిని బంధింపనెంచి—

రామాపురమున రౌడీగుంపుల - రయమున దింపాడు
సామాన్యముగా వేయిరూప్యములు - సారా ఖర్చండి
దారు లూరు చుట్టున్నవన్నియును - త్రవ్వివూడ్చివైచి
పోరాటమునకు కాపుంచా డా - క్రూరుడు రౌడీల
వీరవరేణ్యుడు నారాయణుడీ - వింతపనినిజూచి
వూరిలోని వా రందర నొకచో - గూరుచుండబెట్టి

వ॥ మీరు తొందరపడక మేము వచ్చునంతదనుక యోపికబట్టి యుండుడని చెప్పి, తనతో నలుగుర పెద్దల వెంటబెట్టుకొని జమీందారుగారి మేడకేగి ఆ నీచునితో బాటలు తాతలనాటివనియు, నేడు పూడ్చించుట ఉచితము కాదనియు, రైతుల ధాన్యము, పశువులు, వూరిలోనివి బయటికి బయటవి వూరిలోనికి వచ్చు మార్గములు లేవనియు తగవులు మంచివి కావనియు అనేక విధముల చెప్పెను. కాని యా నీచుడు వినదయ్యె. మరునాడు రైతులు, కూలీలందరు గుమిగూడి—

గడ్డపారలతో బాటలు తవ్వగ - కదలినారుబాబు
అడ్డమువచ్చెను రౌడీగుంపులు - ఆపగ వారలను

వచ్చిన నీచులు కొట్టిరి రైతుల - నొక రిద్దర నండి
చిచ్చరి పిడుగుల విధమున రైతులు - తుచ్ఛులపై దూకి
నలిబలిజేసిరి నీచుల నందర - అలిగి రైతులపుడు
పొలముల కెగబడి వురికిరి రౌడీల్ - విలపించుచు బాబు
బలీబలోయని కూలీరైతులు - పట్టి తన్నుచుండ
యిలపై బ్రతికుంటే బలుసాకులు - కలవు తినగననుచు
చెల్లాచెదరుగ వురికిరి నీచులు - యిల్లు చేరువరకు
బల్లిదులగు నా రైతులు కూలీల్ - బాటలు తవ్వారు

వ॥ నీచుడగు జమీందారు గతిగానక బస్తీజేరెను. ఈ వార్త విని మితిమీరిన సంతోషముతో నున్న రైతుల, కూలీల నొకచో జేర్చి వీరపుంగవుడగు నారాయణ—సోదరులారా! మనకు గల్గినది స్వల్ప విజయమేగాని సంపూర్ణ విజయముగాదు. బస్తీకిజేరి కోర్టులకు దగ్గరగా గూరుచుండి యీనీచుడిం కెన్నోని బాధలు మనల బెట్టగలడు ఇంతేగాక—

అనయముకంటికి రెప్పవోలె నీ - యధముల నెల్లపుడు
కాపాడును యీ ధనిక ప్రభుత్వము - కన్నదంౘ్రడులార
ఈ పరిపాలన పద్ధతిపోనిదె - యిబ్బందులుపోవు
ఇట్టి తరుణమున మన మైక్యతతో - యీ కష్టంబులను
గట్టెక్కియు జాతీయ ప్రభుత్వము - గడియించగవలయు

వ॥ అనిన నారాయణ మాటలకు కూలీరైతు లొక్కుమ్మడి జయ జయ ధ్వనులు చేసిరి.

—:o:—

# తెలంగాణా

దేశాలన్నిటిలో మన భారత - దేశము మణిపూస
వైశాల్యంలో పెద్దది, పంటకు - వజ్రపు తునకయ్యే
నలుబది కోట్ల జనాభాకల్గిన - నాణ్యమైన దేశం
పలురకాల గనులూ నదులూ గల - బంగారపు దేశం

వ॥ ఈ కథ 1945 కు పూర్వం నైజాం పరిపాలనలోని ప్రజల బాధల గాథగా వర్ణించబడింది ఇప్పటికి ముప్పది ఏండ్లు గడిచినా దీనిని ఒక చారిత్రక కథగా మనం బుర్రకథ రూపంలో చెప్పబోతున్నాం. వినే వారు కూడా అదే దృష్టితో ఆలకించగోరుతాం. అప్పుడు మన దేశంలో 600 సంస్థానాలున్నాయి. వీటిలో దాదాపు 10 కోట్ల ప్రజలున్నారు. ఈ సంస్థానాధిపతులు బ్రిటిషు వాళ్ళ అడుగులకు మడుగులొత్తుతూ, వారి మెప్పుకోసం దేశానికి ద్రోహంచేసి ఈ రాజ్యాలు గడించారు బ్రిటిషు వాళ్ళ బూట్లు నాకుతూనే బ్రతికారు. ఇలాంటి సంస్థానాలలో హైదరాబాదు సంస్థానం ఒకటి. దీని హద్దులు—

ఉత్తరాన బీరారు ప్రాంతమూ    తందానా తందాన తందన
దక్షిణాన మదరాసు రాష్ట్రమూ    ,,
పడమరదిశ బొంబాయి రాష్ట్రమూ    ,,
తూర్పున హద్దూ మధ్య రాష్ట్రమూ    ,,
ఈ హద్దులమధ్యను గల రాష్ట్రమె
యిప్పటినైజాము    ,,
అరువందలా సంస్థానాల్లో    తందానా తందాన తందన
వైశాల్యంలో - ప్రజల సంఖ్యలో    ,,
హైద్రాబాదే - అన్నిటికన్నా    ,,
ఎంతో పెద్దది - అంతులేదురా    ,,

జనుల సంఖ్య యీ - సంస్థానంలో ॥తందానా॥
కోటీ డెబ్బది లక్షలున్నదీ ,,
కోటీ డెబ్బదిలక్షలలో ఒక - కోటితెలుగువారె ,,

వ॥ మిగతా దైబ్బెలక్షలూ కన్నడులూ. మహారాష్ట్రిలూ ఈ చేతులు నాకే సంస్థానాధిపతి క్రింద మూతులునాకే జాగీరుదార్లు, దేశ ముఖులు, బంజరుదార్లు, మక్తేదార్లు, అగ్రహారీకులు మొదలైన వాళ్ళు న్నారు. వీరంతా ప్రజల రక్తమాంసాలనుతినే రాబందులే. ఇంతేగాదు. యీ సంస్థానాధిపతికి 16 లక్షల ఎకరాల జాగీరు వుంది. దీన్నిసర్ఫెఖాస్ అంటారు. దీని మీద ఆదాయం రెండుకోట్లు. ఇదిగాక, ప్రభుత్వంలోనుంచి స్వంత ఖర్చుల క్రింద 60 లక్షలు తీసుకుంటాడు. ఇంతేకాదు. ఈ సంస్థా నాధిపతి తన బంధు మిత్రులకు, హితులకు, తొత్తులకు, కొన్ని జాగీర్లు ఇచ్చాడు. వీటిని పాయగాలు అంటారు. ఇలాగే ఇంకా అనేక జాగీరు లున్న ఈ మహాసంస్థానంలో ప్రజల స్థితి ఎలా ఉంటుందంటే—

పౌరసత్వ హక్కులు లేవెవరికి - బాధ లధికమయ్యా
దారీ డొంకా లేని ప్రభుత్వపు - ఘోరహింసలయ్యా
నిరంకుశత్వము తాండవమాడే - నరక కూపమయ్యా
నిరుపేదల దోయుట కందరునూ - దొరగార్లైనయ్యా
చదువగ బళ్ళే లేవా వున్నవి - సరిగా లేవయ్యా
పదుగురు బజారులో సభజేస్తె - బంధిస్తారయ్యా
సుస్తీజేస్తే వైద్యసహాయము - సున్నాయేనయ్యా
పస్తులుండి పనులన్ని జేయవలె - శిస్తు లధికమయ్యా
కూలీ రైతుల చంపి తినే పరి - పాలన బాబయ్యా
పోలీసుల పెత్తనము మెదిలితే - కాలి తన్నులయ్యా
బుట్ట నెత్తిపై పెట్టిన వానిని - పట్టగ లేమయ్యా
పుట్టినామ సంస్థాన ప్రజలుగా - వెట్టి తప్పదయ్యా

వ॥ ఈ ప్రభుత్వపు తొత్తులు, జాగీరుదార్లు, దేశముఖులూ మొదలైన వాళ్ళంతా, ప్రజలచేత వెట్టి చేయించుకొంటారు. ఇంతేగాదు. వందల రకాల అక్రమ పన్నులుకూడా వసూలు చేస్తారు. వీటిని పట్టీ లంటారు.

వ॥ ప్రశ్న—అమ్మబాబో ! వందల రకాల అక్రమ పన్నులే ? అందులో కొన్ని చెప్పుబాబూ !

షాదీపట్టీ - పెండ్లి పీటపై తందానా తందాన తందన
ధేడ్ పట్టీయట - మాదిగపైనా ,,
ధన్‌గర్‌పట్టీ - గొల్లవానిపై ,,
బోయీపట్టీ - బోయీపైనా ,,
చస్తే పట్టీ పుడ్తే పట్టీ - శార్ధానికి పట్టీ ,,
మజ్‌దూర్ పట్టీ - కూలివానిపై తందానా తందాన తందన
జులహపట్టీ - సాలెవానిపై ,,
తెలీపట్టీ - నూనెవానిపై ,,
మఛ్లీ పట్టీ - బెస్తవానిపై ,,
ధారాపట్టీ - పరాలపట్టీ రహ - దారీపట్టీరా ,,
కుంహార్ పట్టీ - కుమ్మరిపైనా తందానా తందాన తందన
లోహార్ పట్టీ - కమ్మరిపైనా ,,
భైంసాపట్టీ - దున్నపోతుపై ,,
అందంపట్టీ - అందంపై నే ,,
పట్టీ లేనటువంటి మనిషి ఆ ప్రాంతంలో లేడు ,,

వ॥ ఇట్టి హైదరాబాదు సంస్థానంలో గువ్వలగూడెం ఒక చిన్న పల్లెటూరు. రంగారెడ్డి అని దేశముఖు ఈ గ్రామంలో వున్నాడు. ఇతనికి పది పన్నెండు గ్రామాల్లో 10 వేల యకరాల పొలముంది. ఇతడు ప్రజల్ని కొల్లగొట్టి విపరీతంగా దాన్ని వృద్ధిచేశాడు. ఈ విధంగా సంపాదించిన ధనంతో—

గువ్వలగూడెపు ఆ నిరుపేదల - కుటీరముల మధ్య
గువ్వలగూడెపు దేశముఖుం డొక - గొప్పమేడ గట్టె.
మేడపన్ను అని పేరుపెట్టి గో - ళ్ళూడగొట్టి వాడు
కూడులేని ప్రజలందరి కొంపలు - గుల్లజేసి పైన
రాతిరి పగలట - పని చేయించెను - ప్రజల చేతనండి
రైతుల బొమికలు ఆ భవనానికి - రాళ్ళయినా యండి
కూలివాళ్ళ నెత్తుటి అడుసున ఆ - గోడలు కట్టించె
జాలివీడి వెట్టిని చేయించుచు - చక్కగ దిద్దించె

వ॥ ఈ దేశముఖు రంగారెడ్డి యింకా యేం చేస్తూవుంటాడు—

చేసిన పాపము కడిగివేసుకొన - చేయు వ్రతంబులను
దోసెడు పువ్వులు శివుని నెత్తిపై - పోసి దండమనును
గుళ్ళు గట్టి సంతర్పణజేయుచు - కొల్లగొట్టు ప్రజను
తెల్లవార్లు వేశ్యల నృత్యంబులే - దేవస్థానమున
సంచు లిచ్చు పోలీసుకు విందులు - చాల చేయుచుండు
మంచిజేసుకొన అధికార్లకు పం - పించును కానుకలు
అంగరక్షకులుగా రౌడీలను - అతడు పెంచుచుండు
దొంగల దోపిడిజేసి పేదలకు - దొరగా మనుచుండు

వ॥ ఈ విధంగా గువ్వలగూడాన్నే గాక తన భూములున్న పది పన్నెండు గ్రామాలనూ దోస్తూ వుంటాడు. అదే గ్రామంలో గోపిరెడ్డి అనే ఒక రైతు కూడా వున్నాడు. ఈయన ఎలాంటివాడు—

గోపిరెడ్డి రెండరకల వా డతి - గుణవంతుం డితడు
కోపతాపములు లేనివాడు - తిన కొరతలేనివాడు
రెడ్డి భార్య కాంతమ్మ చక్కనిది - దొడ్డ గుణము గలది
నడ్డి వంచి పండించు పంటలను - రెడ్డి యనుదినంబు

తనకు చదువురాకున్నా ఇంట్లో - తడి తక్కువ యున్న
అనుజుడు వీరారెడ్డిని బస్తీ - కంపెను చదువుమని

వ॥ వీరారెడ్డి బస్తీలో చదువుతూ ఆరవఫారం వరకు వచ్చాడు, నానాకష్టాలుపడి గోపిరెడ్డి తమ్మునికి డబ్బు పంపుతూనే వున్నాడు. కాని ఆ యేడు గోపిరెడ్డి—

సీ॥ అదె వచ్చెనదునంచు - ఎదురెండ బడి యొంటి
చేను చక్కగ బాగు - చేసినాడు
తొలివాన పడగానె - ములుగఱ్ఱ చేబూని
తోట దొడ్డియు చేను - దున్నినాడు
ఎదవేయు తరుణాన - ముదిఎద్దు పడిపోవ
కోడె నడ్డముపెట్టి - కొట్టినాడు
కులకాంత గని పైరు - కళజూడు మన కష్ట
మీడేరునని పాట - పాడినాడు
వాన లెగబెట్టి ఆ పైరు - వాడిపోవ
అశలడుగంటి - పెంజీక టావరించె
తిండి గింజలకే - చేను పండ కతడు
చాల చింతించి తమ్మునీ - చదువుమాన్పె.

వ॥ యువకుడు వీరారెడ్డి చదువుమాని యింటికి వచ్చాడు. ఆ గ్రామ యువకులు, పెద్దలు బస్తీలోని సంగతులు తెలుసుకుందామని వీరారెడ్డి దగ్గరకు వచ్చారు. అట్టితరి గోపిరెడ్డి తన తమ్మునితో-తమ్ముడూ!

బాగుగ నిను చగివించాలనియే - భ్రాంతికలదుగాని
సాగుదెబ్బ తిని ఈ బండిని నే - లాగలేకపోతి
కత్తిమీద పరిపాలన జేసే - కటిక ప్రభుత్వమిది
తొత్తుక్రింద బడితొత్తు లధము లు - నృత్తులు అధికార్లు

దుండగుడీ కరణమూ దేశముఖు - దుష్టుడునూ కలసి
పండని పొలాలు పండినవంటూ - పైకి రాసినారు
శిస్తుకోస మధికార్లు జప్తులను - తెస్తున్నారిపుడు
ఇస్తారా చస్తార 'లెవీ' యని - ఏడ్పిస్తున్నారు
కౌలుధాన్యమంటాడు దేశముఖు - కఠినుడు పండనిదె
ఏలీలగ చదివించగలను నిను - ఇప్పట్టున నేను

వ॥ వీరారెడ్డికి ఎంతో చదవాలని వుంది. తన చదువు యిలా పాడైపోయినందుకు అతనికి ఎంతో విచారం కలిగింది. కాని తన విచారాన్ని పైకి కనబడనీయకుండా ఏమంటున్నాడంటే—

ఇంతవరకు చదివించినావు గద - అంతే చాలన్న
ఇంతమాత్రమునకై చింతించుట - ఎందులకన్నయ్యా
ఇట్టివేళ నీకండగ నుందును - ఇది నా ధర్మంబు
పట్టుబట్టి యిద్దరమూ దీక్షగ - పని చేద్దామింక

వ॥ అని వీరారెడ్డి తన అన్నకు చెప్పిన జవాబును విని, ఒక వృద్ధుడు "మేము కష్టపడక పంటలుపోయినాయటరా"? అన్నాడు. అంత వీరారెడ్డి "నిజమే బాబాయీ ! మనం ఎంత కష్టపడ్డా ప్రయోజనంలేదు. మనను దోచుకుతినే ఈ దోపిడిగాళ్ళంత నశించే వరకు మనకీబాధలు తప్పవు. ఈ బాధలు తీరాలంటే మనకోసం పాటుపడుతున్న ఆంధ్రమహాసభలో మనమంతా చేరా"లన్నాడు. తర్వాత ఆంధ్ర మహాసభ అంటే ఏమిటో, ప్రస్తుతం అది చేస్తున్న పనిఏమిటో పూస గ్రుచ్చినట్లు ఆ రైతులకు బోధించాడు. వారంతా సంతోషించి మేమంతాతప్పకుండా సంఘంలో చేరుతామన్నారు. తరువాత కొంతసేపు మాట్లాడి అంతా వెళ్ళిపోయారు.

అది వరికోతల తరుణం. నాడు కూలీలంతా దేశముఖు రంగారెడ్డి గారి వరికోతకు వెళ్ళుతున్నారు. కోతకోసిన కూలీలకు ఆయన గిద్దెడు గింజలనుకూడా ఇవ్వడు. దేశముఖుగారి రౌడీలకు నాయకుడైన కొండడు

ఇంటింటికి తిరిగి కూలీలను లేవగొడుతున్నాడు. వాడు మంగలి మంగులు ఇంటికి తిన్నగా వచ్చి—

ఏమేలచ్చీ - మంగలిలచ్చీ - ఏం జేస్తున్నావె
నీమదమేమే అందరు కదిలిన - నీవు కదలవేమె

వ॥ ఈ మాటలు విని లచ్చి గడపలోకి వచ్చి

కొండయబాబూ పిల్లకు జ్వరమూ - ఎండిపోయినాది
తిండీతినదూ కన్నూ తెరవదు - మందుతోంది జర్వము
భయపడుతుందీ - వణకుతున్నదీ - పాడు చలికి తండ్రి
దయజూడండీ - రాలేనండీ దాసురాలనండి

వ॥ ఆమె మాటలు విని నీచుడైన కొండడు—

భళా భళానోయ్‌తమ్ముడా - సై భాయిభళానోయ్ దాదాన
కొండడు భగ్గున మండెను -సై-
కోరచూపులను చూసెను ,,
నీవు చేయుపని అక్కడ ,,
నీ తాతెవ్వడు చేస్తాడె ,,
అనుచూ నీచుడు తిట్టుచు ,,
ఆమె పైకి వురికాడుర ,,
ఏడ్చే లచ్చిని బటబటా ,,
ఈడ్చుచు బైటికి లాగాడు ॥భళా॥
జ్వరమున లచ్చి కూతురు -సై-
వడవడ వడవడ వణకుతూ ,,
అమ్మా ! అమ్మా ! యంటును ,,
అడలి యేడ్వసాగిందిరా ,,
పాపకర్ముడా కొండడు ,,

పటపట పండ్లను నూరుతు ॥సై॥
కొరడా తీసి లచ్చినీ ,,
కొట్టి నడువమంటున్నాడూ ॥భళా॥

వ॥ ఆమె గోలగోలగా యేడుస్తూవుంది. ఆ వీధిని జాఫరు, వీరారెడ్డి వెళ్ళుతున్నారు. ఈ జాఫరు వీరారెడ్డికి ప్రాణస్నేహితుడు. వీరిద్దరా యేడ్పును విన్నారు. త్వరత్వరగా ఘటనాస్థలం దగ్గరకు వెళ్ళారు. దీనురాలైన లచ్చిని విడిపించి. ఆమెద్వారా విషయమంతా తెలిసికొని కొండడు వంక జూచి—

ఆలిపిల్ల లున్నారా లేరా? - అవివేకి నీకు
జాలిలేద కనబడుటలేదె ఆ - బాలిక కన్నులకు
జ్వరబాధను అల్లాడు కూతురును - తల్లి విడుచునటర
దొరకు బుద్ధిలేదా ? నీకా ? ఓ - తొత్తువెధవ పోర

వ॥ అదిగాక ఆమెకు యిష్టంగా వుంటే పనికి వస్తుంది. లేకుంటే రాదు. నిర్బంధించడానికి నీ వెవడవురా, అయినా మీ దొర వాళ్ళకివ్చి చచ్చే దేముంది? అని చీవాట్లు వేశారు. నీచుడైన కొండడు గొణుగుకొంటూ వెళ్ళి దేశముఖుతో ఇదంతా చెప్పాడు. అతడు మండిపడి ఈ జాఫరును, వీరారెడ్డినీ ఏం జేస్తానో చూడు అని రంకెలు వేశాడు.

ఇట్లుండ ఒకనాడు వీరారెడ్డి మంగుల్ని పిలిచి గడ్డం చేయించుకుంటున్నాడు. ఇంతలో కొండడు అక్కడకు వచ్చి మంగుల్ని ఉద్దేశించి—

కొరకొర చూస్తూ - తల పంకిస్తూ - కొండడు పలికాడు
త్వరగారారా - ఓరి బద్మాష్ - దొర రమ్మన్నాడు
గొరిగే గడ్డం తదుపరి చూద్దాం బిరాన లేలేర
పరుగునరారా - కదలవేమిరా - నరికెద నన్నాడు

వ॥ మంగులు స్థితి అప్పుడెలా వుంది—

ముందు గోయిగా - వెనుక నూయిగా - ఉందా దీనునకు
కుందుచు మంగులు - అట్లే కూర్చుని - కొంత తడవు తుదకు
ధారగ కన్నీర్ - గార్చుచు చూచెను - వీరారెడ్డి దెస
వీరుడు వీరారెడ్డి వాని గని - వివరించెను యిటుల
నే నిను దండించను పోమ్మ చటికె - దాన నేమి గాని
బానిస బ్రతుకే నరకం మంగులు - భయపడడం మాను

వ॥ అని అనేక నీతులు జెప్పి మంగలిని ఓదార్చాడా యువకుడు "మంగులూ! నీవు ఒక కత్తి నాకు యిచ్చివెళ్ళు, అ మిగతా సగం గడ్డం నేనే చేసుకుంటా" నన్నాడు. ఇంతలో జాఫరు కూడా అక్కడికి వచ్చాడు మంగులు వీరారెడ్డితో ఏమంటున్నాడు.—

పిల్లను తల్లిని కాపాడిన ఓ - చల్లనయ్యా తుదకు
వెళ్ళవలెన! ఈ రీతిగ మిమునే - విడచి యతనికడకు
చావుకు రెండా చావులు - చస్తే చస్తానంతేను
ఈ విధముగ బతికేకంటే ఆ - చావే మేలనెను

వ॥ ఈ విషయమంతా గ్రహించిన జాఫరు మంగులుని బలపరిచాడు. అధముడైన కొండడుపోయి ఒకటికి రెండు కల్పించి, ఈ విషయమంతా దేశముఖుకు చెప్పాడు. ఇక్కడ వీరారెడ్డి గడ్డం చేసిన తరువాత మంగులు దేశముఖు యింటికి వెళ్ళాడు. అదివరకే నిప్పులు గ్రక్కుతున్న దేశముఖు.—

వచ్చేటి మంగులును - తుచ్ఛుడట్లేచూచి
పిచ్చి పిచ్చిగదిట్టి - రెచ్చి కేకలు వేసి
చెట్టునకు గట్టించినాడు - దీనుణ్ని
చెండి వేయగసాగినాడు
క్షణములో ఈ వార్త - జాఫరుకు, రెడ్డికీ
తెలిసీ, తెలియంగానె - ధీరు లిద్దరు కదలి

పరుగు పరుగున వచ్చినారు - మంగలికి
ప్రాణభిక్షను బెట్టినారు.

వ॥ ఆ వీరు లిద్దరితోపాటు ఇంకా కొంతమంది యువకులు కూడా అక్కడికి వెళ్ళారు. వీరిని చూసేసరికి రౌడీల గుండెలు దడదడా కొట్టుకున్నాయి. వచ్చీరాగానే వీర యువకులంతా మంగలు కట్లన్నీ వూడ తీయడానికి పూనుకున్నారు. వీరారెడ్డి మాత్రం నీచుడైన దేశముఖు దగ్గరకు వెళ్ళి—

## కీర్తన (డైలాగ్)

వీరా : తగున నిరుపేదలను - దండించు టొక ఘనము
దిగమ్రింగి యాస్తులను - సగము చంపావెపుడో
పగతీరదా యింక - బాధించుచున్నావు

దేశ : కన్ను గానక యిటుల - నన్నెదిర్చెదవటర
ఎన్ని గుండెలతోడ - ఇచట కరుదెంచితివి
నిన్ను నీ సంఘాన్ని - మన్ను జేసెద చూడు

వీరా : ఈ పిచ్చి పిచ్చి చేష్ట - లెన్నాళ్ళు సాగును
మన్నించ రిక ముందీ - మాదిరిగ జేశావ
కన్ను దెరచిరి ప్రజలు - కనిపెట్టి మనవయ్యా

దేశ : ఓరి వీరారెడ్డి - పోర తెగవాగకుర
నీ రూపు మాపనిదే - నే నెందుకుర బ్రతికి
కారుకూతలు మాని - నోరుమూసుకు పోర

వ॥ ఇంతలో మంగులు కట్లన్నీ వూడదీసి అతనితో యువకులంతా అక్కడికి వచ్చారు. దేశముఖు వారందర్నీ బెదురు నక్కలా చూస్తూ ఇంటోదూరాడు. వారంతా మంగుల్ని తమ వెంట తీసుకొని వెళ్ళిపోయారు. ఇందతా చూస్తే దేశముఖుకి కడుపులో చెయ్యిపెట్టి కలచి

నట్లుగావుంది. ఏమీ తోచక కరణం (పట్వారీ) శంకరరావుకు కబురు పంపాడు.

ప్రశ్న : ఈ శంకరరావెవరురా ?

జవాబు : ఇతనా ?

కరణం శంకర్రావా వూరికి - కాలయముండితడు
నిరుపేదల లాలించి గుంజుటలో - నేర్పరి హంతకుడు
తడిగుడ్డలతో గొంతులు గోసే - దానవు డీతండు
కుడి భుజంబు ఆ దేశముఖుని కీ - కుటిల మానవుండు.

వ॥ దేశముఖు కబురందగానే శంకరరావు తరతరలాడుతూ వచ్చాడు.

పశ్న : ఎందుకండీ దొరగారూ! హడావుడిగా కబురంపారు?

జవాబు : ఎందుకా ?

## కీర్తన

వినవయ్యా ! తెల్పెదను - విపరీత మొకటి ॥విన॥
గ్రామవాసులు - కావరంబున
కనులు గానక - నను ఎదిర్చిరి ॥విన॥
గుడ్డిగువ్వ ఖ - రీదు చేయని
కుంకలగు ఈ - పెంకె యువకులు
దేశముఖులను - నాశనము గా
వించవలెనని - ఎంచిరరరే॥ ॥విన॥
కలదు రౌడీ - బలగమెంతో
కలదు పోలీసుల - సహాయము

జాలి లేదవ - లీలనె నీ
కూలిరైతుల గోరిగట్టెద॥ ॥విన॥

వ॥ అప్పుడు శంకరరావు—

కాలం మారిందయ్యా వెనుకటి - కాలముగాదు దొర
చీలిక పెట్టి ఈ ప్రజలందరి - పాలించాలి దొర
హిందూ ముస్లిం తగవు పెట్టి ఆ - ఇద్దర విడదీసి
ముందు రెడ్డినీ పిదప జాఫరును - బొందబెట్టివేసి
ఇద్దరి శవములపైని గూరుచుని - ఏలుదాము రాజ్యం
పెద్దలనాటివి పాత పోకడలు - విడువు మిపుడసాధ్యం

వ॥ కాన ముందు వాళ్ళిద్దరికీ తగవుపెట్టే మార్గము ఆలోచించాలన్నాడు తుదకు ఇద్దరు కలసి ఒకప్లాన్ వేశారు. ప్లాను ప్రకారం శంకరరావు ఇత్తెహాదుల్ ముస్లింలీగు నాయకుని తీసుకొని వచ్చాడు. ఆయన దేశముఖు యింటిదగ్గర మకాంవేసి జాఫరును అక్కడికి పిలిపించి—

ఆవో భాయీ జాఫరు భాయీ - అచ్ఛావున్నావా?
ఆవో బైఠో ఏమిటి హట్టా - అగపడుతున్నావు?

వ॥ అని జాఫరును వలలో వేసుకోవడానికి కొంతసేపు లాలించి మెల్లగా మాటల సందర్భంలో మీవూళ్ళో ఆంధ్రమహాసభ ఆఫీసువుందా? అని అడిగాడు. ఉంది అందులో నేను కూడా మెంబర్నేనని, జవాబు చెప్పాడు జాఫరు. మీ పెద్ద ఎవరన్నాడా నాయకుడు. మా సంఘం పెద్ద వీరారెడ్డిగారు. ఆయన చాలా మంచి వాడన్నాడు జాఫరు. అప్పుడా నాయకుడు—

జాఫరుభాయీ వినవోయీ ఒక - సంగతి చెప్తాను
కాఫీర్ దోస్తీ ఎందుకుభాయీ - కావా ముస్లిమువు?
సల్లని నవాబు రాజ్యంపోతే - జాతికి దెబ్బ భాయి

అల్లాకూ మజహబ్ కూ నుక్ సాన్ - అయ్యయ్యోభాయి
రాజ్యంజేసే జాతీమన్దీ - రాజ్యం మందీ భాయ్
రాజ్యం పోతే బద్మాష్ హిందూ - రాజ్యం వస్తాది
నీవూ ముస్లిం నేనూ ముస్లిం - ఆవోరేభాయి
క్యావో వీరారెడ్డి కోన్హై - కైసీ దోస్తీరే

వ॥ అని మతాన్ని వుద్ధరించడానికి వచ్చిన పైగంపర్‌లాగ ఒక ధర్మోపన్యాస మిచ్చాడు. ఆ సంఘంలో వుంటే నీకు చాలా ప్రమాదం వస్తుందని బెదరించాడు. నిన్ను కాఫిర్లలో జమ కడతారన్నాడు. కులపు వాడివి, మంచివాడివి గనుక ఇంతగా చెప్పుతున్నానన్నాడు. జాఫరు తల వంకిస్తూ ఆయనవద్ద శలవు తీసుకొని వెళ్ళిపోయాడు, యధాప్రకారంగా వీరారెడ్డితో స్నేహంగానే వుంటున్నాడు. జాఫరు తనయెత్తులో పడలేదని తెలిసిన దేశముఖూ, శంకరరావులు మరొక ఎత్తువేశారు. ఒకనాడు శంకర్రావు జాఫరు యింటిదగ్గరలేని సమయం చూచి అతని తల్లియైన కాసింబీని కలుసుకొని ఆమెతో—

వినవమ్మా కాసింబీ ! నేనొక - విషయం చెప్తాను
గుణవంతుడు నీ జాఫరు ఎంతో - ఘనుడనుకున్నాను
ఈ పగిదిగ చెడిపోతాడని నే - నెంచనైతినమ్మ
దీపముండగనె యిల్లు సర్దుకో - తెల్పుచుంటినమ్మ
నాకు ప్రాణస్నేహితు డీజాఫరు - నాన్న అందువలన
నీకీసంగతి జెప్పవచ్చితిని - నిజమునమ్మ మనిన
కనుగొలకుల నీర్గార్చుచు పలికెను - కాసింబీ యిటుల
కనికరించి నాబిడ్డను మీరే - కాపాడాలి దొర
చిన్నతనము ఏవైనా ఈతడు - చెడ్డపనులు జేస్తే
కన్నతండ్రివలె నా బిడ్డను మ - న్నించవలెను మీరు

వ॥ ఏమో బాబు తండ్రిలేని బిడ్డ. వాడిని మీరు దయదలచకపోతే ఇంకెవరు దయతలుస్తారు అని ప్రతిమాలింది. అంత కుటిలుడైన శంక రావు—

వినవమ్మా ఈ - వీరారెడ్డీ తందానా తందాన తందన
సంఘంబెట్టీ - సభ్యుల జేర్చి ,,
కుర్రోళ్ళందర - కూడగట్టుకొని ,,
నైజాం ప్రభువును - నాశము జేయగ ,,
కుట్రపన్నుతున్నాడట నేడాకుర్రకుంక ఏదో ,,
జాఫరందులో - సభ్యుడటమ్మా తందానా తందాన తందన
అధికార్లకు ఈ - అంతెతెలిస్తే ,,
జైలూ తప్పదు - చావూతప్పదు ,,
చెప్పుచునుంటిని - గొప్ప ప్రమాదం ,,
ముస్లిం రాజును కూలద్రోయుటా ! -
ముస్లిమైనవాడు

వ॥ అని ఏవేవో కల్లబొల్లి కూతలు కూసి వెళ్ళిపొయ్యాడు. జాఫరు ఇంటికిరాగానే తల్లి కొడుకుని కౌగలించుకొని యేడ్చింది. నీకా సంఘం గొడవ వద్దుబాబూ అని నిర్బంధించిది. జాఫరుకంతా అయోమ యంగా వుంది. నాటినుంచి వీరారెడ్డి స్నేహం మాని తటస్థంగా వుండటం ప్రారంభించాడు.

ఇదే తరుణమని దేశముఖు వీరారెడ్డిమీద తన దండయాత్ర ప్రారం భించాడు. గోపిరెడ్డి పేర ఒక దొంగనోటు సృష్టించి క్లయింటు చేశాడు. త్యాగియైన వీరారెడ్డి బెదరలా. నోటుకు అన్సరు పెట్టాడు. ఒకనాడు కోర్టు నుంచి చీకటిలో ఒంటరిగా వస్తున్న వీరారెడ్డిని దేశముఖు తన రౌడీలతో కొట్టించాడు. ఈ సంగతి తెలిసి గ్రామస్తులంతా అతనిని చూడటానికి వచ్చారు. జాఫరూ అతని తల్లికూడా వచ్చారు. వీరారెడ్డి జరిగిన సంగ తంతా వారందరికి చెప్పి తరువాత వారికి ఏమని బోధిస్తున్నాడు?

ధీరులారా ! నిరుపేదలార ! ఓ - తెలుగు బిడ్డలార !
వీరులు శూరులు తెలుగు బిడ్డలను - పేరు నిలుప లేర ! !
కూలీ రైతుల నెత్తురు త్రాగే - క్రూరమృగంబులకు
కాలం దగ్గర పడింది అందరు - మేలుకోండి నేడు
నలిబిలిగా తమ ఇనుప పాదముల - నలగద్రొక్కి మనల
కలకాలము తమ పెత్తనంబులను - నిలుపుకొనగ ఇటుల
హిందూ ముస్లిం తగవులు పెట్టే - ఎత్తు లెత్తినారు
హిందూ ముస్లిం లెరిగి మర్మమును - ఎదురించాలయ్యా
వీర యోధుడౌ బందగి రక్తం - ధారగట్టినపుడు
నోరు మెదపలేదీ ప్రభుత్వ మే - యూరుబోయె ? నపుడు
కలిగిన వాళ్ళూ లేని వారలను - కులాలు రెండేను
తెలిసికొనండయ్యా దరిద్రులీ - కలతల నష్టమును

వ॥ అదీగాక, ఈ ప్రభుత్వమూ. దాని తొొత్తులూ మనల్ని రాత్రిం బగళ్ళు దోచుకుంటూ ఉన్నారు——

వినుడు దేశముఖు ఇంటివద్ద ఏ - విందు జరిగినాను
దినమైనా, పెండిలియైనా, త - ద్దినము జరిగినాను
కూలీ రైతుల గొంతుమీదనే - కూర్చుంటారు గద !
పాలు పెరుగు మన మాతని ఇంటికి - పంపించాలి గద !
వెట్టికి కూలీల్ దంచి ధాన్యమును - కట్టెలు కొట్టాలి
పెట్టడు పట్టెడు బువ్వను వారికి - పెండ్లినాడు కూడా
వందగ్రారె కొకదానిని ఎట్లా - విందు కివ్వవలెను?
అందమైన కోడెలు మనకుంటే - అతని కివ్వవలెన ?
ఎన్నని చెప్పను ఈతడు పెట్టే - హింసలు మననిపుడు
అన్నలారా ! ఎదిరించితీరవలె - అధముల మనమంత

వ॥ అని దేశముఖు పెట్టే బాధలన్నిటిని వర్ణించి చెప్పాడు ఆ దేశ భక్తుడు. యువకులందరికీ ఒడలు పొంగింది. తమ రక్తంతాగే దేశముఖుల అంతు కనుక్కుంటామన్నారు. కాని పెద్దవాళ్ళ కేదో కొంచెం భయంగానే వుంది. ఇంటికి వెళ్ళేటప్పుడు కాసింబీ కొడుకుతో "ఆ అబ్బాయి జెప్పిన మాటలన్నీ నిజమేరా" అంది. రైతులంతా ఒండొరుల కష్టాలు చెప్పుకుంటూ ఇళ్ళకు పోయారు. తెల్లవారేసరికి పోలీసులతో సహా తహశీలుదారు గువ్వలగూడెంలో ప్రత్యక్షమయ్యాడు. రైతుల్ని సాధించడానికే వీరందరిని దేశముఖు పిలిపించాడు. ఆ వచ్చిన తహశీలుదారు రైతుల్ని లెవీ ధాన్యం ఇవ్వమని నిర్బంధింప సాగాడు—

ఆ భూము లసలే పండవు. అవునుమరి. రైతులో లేని ప్రాణ భూమికి ఎక్కడనుంచి వస్తుంది. అందులో ఆయేడు వానలు లేక అర్ధ పంటకూడా పండలేదు. ఏ పాటు తప్పినా సాపాటు తప్పదన్నట్లు లెవీ ధాన్యం తప్పేటట్లులేదు. ఈయేడు లెవీధాన్యం ఇవ్వలేమన్నారు రైతులు తహశీలుదారు మండిపడ్డాడు. నోట పట్టరాని బండబూతులన్నీ తిట్టి, నిరంకుశంగా వసూలు చేయడం ప్రారంభించాడు. పోలీసులు రైతుల ఇళ్ళలోదూరి—

భళా భళానోయ్ తమ్ముడా - సై - భాయి భళానోయ్

దాదాన

ఎగబడి ఆ పోలీసులు -సై-
ఏడ్చే స్త్రీలను నీచులు ,,
కటికి తిట్లనే తిట్టిరీ ,,
కన్ను సైగలను జేసిరి ,,
ఉన్న ధాన్యమును పూర్తిగ ,,
ఊడ్చి పారవేస్తున్నారు ॥భళా॥
కఠినులు ముందుకు సాగుచు -సై-
క్రమముగ ఇండ్లను దోయుచు ,,
జాఫరు ఇంటిని జూచిరి ,,

పకపక నవ్వుచు నీచులు -సై-
చక చక అచటికి పోయారూ ॥భళా॥
జాఫరింటికడ లేడురా -సై-
పాపము ముదుసలి యున్నది ,,
పోలీసుల గని ఆయమ ,,
చాల భయంబున వణుకుచు ,,
జాఫరు లేడిపుడింటిలో ,,
రేపురండి మీరన్నాదీ ॥భళా॥
దొర పోయించంగ తెగతాగిన తల - బిరుసు అమీనపుడు
పరమసాధ్వి నా తల్లిని తిట్టుచు పాడుతిట్టు లెన్నో
పట్టి సిగను నిర్ధయగ గబాగబ బయటికి లాగాడు
పట్టలేక కోపము కాసింబీ - తిట్టసాగె వాని

వ॥ ఆ నీచుడైన అమీను కొరడా తీసి ఆ తల్లి మీద దెబ్బ వేయ బోతున్నాడు. ఇంతలో—

వీరులైన యువకులు కొందరు తన - వెంట కదలిరాగ
వీరుడు వీరారెడ్డి వచ్చి ఆ - క్రూరుల నెదిరించె
కర్రలతో వడిసెళ్ళతో యువకులు - కమ్ముకొనగ చూచి
తర్రు బుట్టి పోలీసులు వణకుచు - దారిపట్టినారు
దేశముఖూ కరణం ఉరికారటు తిరిగి చూడకుండ
కాసింబీ వీరారెడ్డిని గని - కౌగలించి ఏడ్చె

వ॥ వీరారెడ్డి ధైర్యం చెప్తుతూ ఆమెను ఓదార్చుతూ ఉన్నాడు. ఇంతలో పొరుగూరు వెళ్ళిన జాఫరుకూడా వచ్చాడు. కొడుకును జూడ గానే కాసింబీ ఆవురుమంది. వీరారెడ్డి ద్వారా విషయమంతా తెలిసికొన్న జాఫరు—

అన్నా మోసము జరిగెను దయతో - ఆదరించు నన్ను
చిన్ననాటి చెలికాడ అపార్థము - చేసికొంటినిన్ను
ఈ మత బోధను పెద్ద పెద్దవా - రెందుకు చేస్తారొ
నీ మతమే మతమని ఎందులకీ - నీతులు చెపుతారొ
దేవదూతలై పైగంబరులై - దేశద్రోహులంత
ఈ విషమును ప్రజలకు ఎక్కించుట - దెందులకో తెలిసె
ఏ మతస్తుడరుదెంచి చేసెనో - ఈ మత బోధలను
ఆ మతస్తుడే చేసినాడు ఈ అవమానము నేడు
విన్నారా! ఓ ముస్లిం సోదర - విజ్ఞులార మీరు
అన్నా తమ్ముల తగవు కొంపకె - హాని తెలిసికోండి
పేదలందరే జాతిని బుట్టిన - పేదవారెనయ్యా
పేదకు తోడ్పడువాడు లోకమున - పేదవాడెనయ్యా
తప్పు జేసితిని శిక్ష వేయుడీ - తగినరీతి నాకు
ఒప్పుకొందు నే శిక్ష వేసినా - ఓ సోదరులార.

వ॥ అని పశ్చాత్తాప పడుతున్న జాఫరు వీపు తట్టుతూ వీరారెడ్డి—

ఉ॥ తంపులుపెట్టి దేశమును ధ్వంసముజేయు మహాకిరాతులా
కుంపిణివారు బెంచుకొను కుక్కల కుక్కల వీరలీ ప్రజా
సంపద కొల్లగొట్టి మనజాతికి జాతికి మధ్య కక్షలు
బ్బింపగ సాగినారు కనిపెట్టితి వంతియె చాలు తమ్ముడా!

వ॥ కాబట్టి యిది గ్రహించి అంతా ఏకంగా వుండే మనల్ని ఎవరూ ఏమీ చేయలేరు. మనక్కావలసింది ముస్లిం ప్రభుత్వమూ కాదు. హిందూ ప్రభుత్వమూ కాదు. మరియే యితర ప్రభుత్వమూ కాదు. మనకు కావలసినది ప్రజల ప్రభుత్వము. ఇదే మన కోరిక. హిందూ దేశముఖు హిందూ పేదల్ని, ముస్లిం ప్రజలనూ దోచుకుంటాడు. ఇలాగే ముస్లిం జాగిర్దారు ముస్లిం ప్రజలనూ, హిందూ ప్రజలనూ దోచుకుంటాడు.

వాళ్ళేకాదు ఉద్యోగస్తులు కూడా ఇంతే. కాకపోతే ఈ ముస్లిం 'అమీను, (సబ్ ఇన్‌స్పెక్టరు) హిందూ దేశముఖు కెందుకు తోడ్పడాలి అన్నాడు. నిజమే నాయనా అంటూ కాసింబీ తన తొడుకును, వీరారెడ్డిని చేతులు పట్టించి మీరిద్దరు అన్నదమ్ముల్లాగ ఉండండని దీవించింది. ఇందరా చూస్తూ ఉన్న ప్రజా సమూహం ఆ యువకు లిద్దర్ని జూచి—

కాలం మీదే కష్టం మీదే కన్న తండ్రులార
కూల్రదోసి ఈ దోపిడి దొంగల - క్రూర ప్రభుత్వముల
మీరె దేశదాస్యమును బాపగల - ధీరులనుచువారు
వీరయువకులొ తమ పుత్రుల దీవించి వెళ్ళినారు

వ॥ ఇకనక్కడ దేశముఖు రంగారెడ్డి తనకు జరిగిన పరాభవానికి ఉడికిపోతూ శంకరరావుతో—

ఎంత వింత ఇది - ఎంత ఘోరమూ తందానా తందాన తందన
ఎందుకయ్య మన - మింకా బ్రతికి ,,
ఎంతపనికి దిగి - రీ గ్రామస్తులు ,,
ఎన్ని గుండెలతొ న - న్నెదిరించిరి ,,
ఈ నీచుల హతమార్చి తీరవలె - ఏమైనాగాని ,,
వే లెన్నయినా - వెరువకుండ ఈ తందానా
కూలీరైతుల - కాలరాయుచూ ,,
వీరారెడ్డీ - గోరీకట్టి ,,
జాఫరుగాడిని - సాధించనిదే ,,
పేరుపెట్టి రంగారెడ్డీ యని - పిలువ వద్దు నన్ను ,,

వ॥ అని తన కక్షను వెళ్ళగక్కుతూ ఉన్న దేశముఖుని జూచి పట్వారీ (కరణం) ఏమంటున్నాడు.

మాటలతో జరిగేపని గాదిది - మర్మ మెరుంగుదొర
మోటా రెక్కి సరాసరి పట్నం - బాటపట్టి త్వరగ

ఎక్కడ వేసే మేత సరీగా - అక్కడెయ్యవయ్య
దక్కవు ప్రాణాలాస్తులు పైసా లెక్కజూడకయ్య

వ॥ అని పట్వారీ చక్కగా బోధించాడు. వెంటనే రంగారెడ్డి హైదరాబాదు వెళ్ళి, పనులన్నీ సర్దుకొని తిరిగి వచ్చాడు. తరువాత కొద్ది రోజుల్లో పేదరైతు గోపిరెడ్డి నోటు డిక్రీ అయింది, వీరారెడ్డి, జాఫరులు ఊళ్ళోలేని తరుణం జూచి ఆ నిరుపేదయింటిమీదకు జప్తు తీసుకువచ్చాడు. దేశముఖు, రౌడీల సహాయంతో అమీనావచ్చి గోపిరెడ్డి ఇల్లు ముట్టడిం చాడు.సమయానికి గోపిరెడ్డి కూడా యింటివద్ద లేడు. పొలానికి వెళ్ళాడు. కాంతమ్మ ఒక్కతే ఇంట్లోవుంది. "మగవాళ్ళు లేనిదే ఇంట్లోకి రావద్దు" అంది. కాని వారాగలేదు. ఇంట్లోదూరి రౌడీలు సామానులన్నీ గబగబా బయటికి పారవేస్తున్నారు. విచారిస్తూ కాంతమ్మ వంట ఇంట్లో ఏదో సర్దుకొంటూ ఉంది. రౌడీల నాయకుడైన కొండడు. ఆమె దగ్గరకు వెళ్ళి పండ్లికిలిస్తూ మృగంలాగా ఆమెమీద పడబోయాడు. అప్పుడా వీరవనిత-

అహంకారమున పైకి వచ్చునా - యధముని పొడగాంచి
మహాకాళియన హుంకరించి ఆ - మహిళామణి లేచి
దిమ్మ తిరిగిపడ ఆ కొండని ఎదు - రొమ్ము పగులతన్నె
అమ్మయ్యో యని అరచుచు అధముం - డైదు మొగ్గలేసె

వ॥ ఈ అరుపు విని రౌడీలంతా అక్కడకు వచ్చి, కాంతమ్మను చుట్టుముట్టారు. అప్పుడామె—

పగబట్టిన సర్పంబుల కైవడి - పైకిదూకుచున్న
పొగరుబోతులను గన్గొని ఆయమ - భగభగభగమండి
పరుగిడి అటగల గండ్రగొడ్డలిని - తర్వాగ అందుకొని
మెరపుతీగెవలె మెరయుచు గొడ్డలి - గిరగిర త్రిప్పుచును
ఎదిరించిన కాంతమ్మ రూపుగని - చెదరిపోయి కనులు
భెదరియామెదరి జేర వెరచిరా - యధములు రౌడీలు

వ॥ ఇంతలో కొంతమంది యువకులు పరుగెత్తుకొని వచ్చారు. రౌడీలు వారిని జూచి తమ నాయకుడైన కొండడిని ఎత్తుకొని దారిపట్టారు తన మనిషిని వీరారెడ్డి, జాఫరులు కొట్టారని, అమీనాను సాక్ష్యం వేసి కేసుపెట్టాడు దేశముఖు. వారిద్దరికి అరెస్టు వారంటు (గిరఫ్ తారీ హుకుం) పెట్టారు. ఇదివరకే ఇలాంటి కేసులు చాలా వున్నాయి' ఈ కేసులో జామీనుకూడ ఇవ్వరని తెలిసింది. వెంటనే వీరారెడ్డి జాఫరులు మాయమై రహస్యంగా పనిచేయడం ప్రారంభించారు. పోలీసులు వచ్చి నీ తమ్ముడేడని గోపిరెడ్డిని అడిగారు. ఆయన నాకు తెలియదన్నాడు. ఆ లంచగొండి పోలీసులా పేదరైతును అరెస్టుజేసి దేశముఖు మేడకు తీసుకపోయి—

గోపిరెడ్డి నా యమకింకరు లొక - కొట్లో పడవేసి
చూపసాగిరిక తమ ప్రతాపమా - కా పురుషులు బాబ
బూటుకాళ్ళతో తన్నుచు బాదిరి - లాఠీలతొ వారు
పోటు పోటుకా దీనుని ఎముకలు - పొడియౌతున్నాయి
గిలగిల తన్నుకొనే ఆ రైతును - మెలిచి కట్టినారు
బలవంతంబున మూత్రము తాపిరి - ఖలులా రైతునకు
అన్నదాత నోట్లో కుక్కిరి తుద - కశుద్ధ మయ్యయ్యో
కన్నులలో మర్మస్థానములో - కారము కూర్చారు

వ॥ తుదకు ఆ అర్ధరాత్రివేళ స్పృహా తప్పి పడియున్న ఆ పేద రైతును మోసితెచ్చి, ఆయన ఇంటిముందు పారవేసిపోయారు దేశముఖు రౌడీలు. కొంతసేపటికి స్పృహ వచ్చి గోపిరెడ్డి మూల్గసాగాడు. దుర్మార్గులు తన భర్తను ఏం జేస్తున్నారో అనే చింతతో నిద్రపట్టక కొట్టుకుంటున్న కాంతమ్మ భర్త మూల్గును గుర్తుపట్టింది. ఆదుర్దాగా తలుపు తీసి వాకిట్లోపడియున్న భర్తను జూచి గొల్లుమంది. ఈ గోలకు ఇరుగు పొరుగు రైతులంతా లేచి పరుగు పరుగున వచ్చారు. దేశముఖును తిట్టుకుంటూ గోపిరెడ్డిని తీసుకెళ్ళి మంచంమీద పడుకోబెట్టారు. కాసింటి

మొదలైనవాళ్ళు కాంతమ్మను ఓదారుస్తున్నారు. తెల్లవార్లూ వారంతా అక్కడే వుండి గోపిరెడ్డికి చేతనైన సేవజేస్తున్నారు. తెల్లవారేసరికి ఈ వార్త ఆ పదిపన్నెండు గ్రామాలకు తెలిసింది. కూలీలు, రైతులు తండోప తండాలుగా వచ్చి గోపిరెడ్డి ఇల్లు నిండుతున్నారు. వీరారెడ్డి, జాఫరు లీ కబురందగానే బయలుదేరి బారెడు ప్రొద్దెక్కుసరికి ఇల్లు జేరారు. మరిదిని జూడగానే కాంతమ్మ కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ—

అయ్యో బాబూ వచ్చావా! నీ - అన్నయ్యను జూడు
అయ్యయ్యో మన కెవరుదిక్కు మీ - యన్న యిటులయ్యె

వ॥ అని విలపిస్తూ భర్తవైపుజూచి—

మమ్మందర కన్నెత్తి చూడరీ - తమ్మునైన గనుడు
తమ్ముని తలచుక కలవరించితిరి - తమ్ముడిడుగొ ననియె

వ॥ అప్పుడు వీరారెడ్డి వదినె నోదార్చి తన అన్నదగ్గరకు వెళ్ళి-

అన్నా వీరారెడ్డిని వచ్చితి - కన్ను తెరువు మనిన
కన్ను విప్పి తమ్మునిగని కన్నీర్ - గార్చె గోపిరెడ్డి
కని ఈ దృశ్యంబును జనులంతా - కార్చిరి కన్నీరు
కను గొలకుల నీర్ నింపివ అన్నయ - కనుల తుడిచి రెడ్డి

వ॥ పెనవేస్తూ ఉన్న దుఃఖాన్ని, క్రోధాన్ని దిగమ్రింగి, పక్కలో కూర్చుని ఆయన శరీరాన్ని నిమరసాగాడు. అట్టితరి గోపిరెడ్డి మెల్లగా తమ్మునితో—తమ్ముడూ—

ఉంటిని నిను జూచుటకై ప్రాణా - లుగ్గబట్టి నేను
చంటిబిడ్డవై నీవున్నపుడే - చచ్చిపోయె అమ్మ
బాలుడవగు నిను తల్లి రీతి నీ - వదిన పెంచినదిర
కాలము చెల్లెను నాకు ఈమె నే - లీల చూచెదవొర

వ॥ అని ఏమో చెప్పబోతూవున్న అన్నమాటలకు వీరుడు వీరారెడ్డి అడ్డంవచ్చి అన్నా!—

అమ్మలేని లోపము దీర్చిననా - అమ్మ వదినగారు
అమ్మా, అన్నా, వదిన ఇంక ఈ అమ్మగారె నాకు

వ॥ కాన నేను ఈ తల్లికి ఏ లోపమూ రానీయను. అవసరమైతే నా ప్రాణాలనైనా ఇచ్చి వదినను కాపాడుతానన్నాడు వీరారెడ్డి. తమ్ముని మాటలకు సంతోషించి గోపిరెడ్డి—ఇంకొక కోరికుందిరా తమ్ముడూఏమి టంటావా!—

ఈ రీతిగ నన్నవమానించియు - హింసించినయట్టి
క్రూరు లెందరినొ బాధించెదరీ - తీరుగ దేశమున
పోరాటంబున వీరందరినీ - మారణ మొనరించి
వీరారెడ్డి తీర్చుమురా నా - కోరిక యిదియేను

వ॥ ఎప్పుడైతే గోపిరెడ్డి పగతీర్చమన్నాడో అక్కడే వుండి కుములుతూవున్న జాఫరు ప్రజలవైపు తిరిగి ఏమంటున్నాడు—

అన్న యుండగనె తెచ్చి వాని మన - యన్నకు బలియిచ్చి
అన్న పగను తీర్చాలి లెండు ప్రజ - లందరనుచు కదలె

వ॥ ప్రజ లెలావున్నారు—

భళా భళానోయ్ తమ్ముడా -సై- భాయి భళానోయ్ దాదాన
పటు దర్పంబున వీరులు -సై-
ప్రజలందరు కదిలారురా ,,
పగ సాధించక ధరణిపై ,,
బ్రతికి ఫలిత మేమన్నరు ,,
పాపి దేశముఖు నిప్పుడే ,,
భస్మము చేయాలన్నారు భళా
యువకులు వురుకులు పెట్టిరి -సై-
యువతులు నడుములు గట్టిరి ,,

వృద్ధులు మీసాల్ దువ్విరి -సై-
పెద్దలు ముందే నిలచిరి ,,
కత్రలు కత్తులు బట్టిరీ ,,
కయ్యానికి కదిలారయ్యా ॥భళా॥

వ॥ దూరదర్శియైన వీరారెడ్డి ప్రజలకు ముందు నడుస్తూ వున్న జాఫరుకు ఎదురుగా వెళ్ళి అతన్ని ఆపి, ప్రజలతో—

దేశోద్ధారకులారా వినుడిదె - తెల్పెద నొకామాట
దేశద్రోహులను పట్టితెచ్చి ఉరి - తీయు టెట్లొ నిజమె
కాని నేను తెల్పెదనొక విషయము - ఘనులారా వినుడు
దేనికైన యోచించి తీవ్రముగ - పూనుకొనుట మేలు
అనుదిన మెన్నో ఇట్టి బాధలనె - యనుభవించుచున్న
మన పది పన్నెండూళ్ళలోన గల - జనుల నైక్యపరచి
ఘాతకుడగు ఈ నీచు నెదిర్చిన - కలిగితీరు జయము
ఏ తయారు లేకుండ వీరిపై - కేగుట సరిగాదు....

వ॥ అని యెన్నోరీతుల బోధించి ప్రజల్ని అపుజేశాడు. ఆ పది పన్నెండు గ్రామాల యువకులు ఆ రోజు అక్కడే వున్నారు. సాయంత్రానికి రైతుబాబు గోపిరెడ్డి చనిపోయాడు. ప్రజలు బ్రహ్మాండమైన ఉత్సవము బయలుదేరదీసి చుట్టుపట్ల గ్రామాలలో ఊరేగించారు. తుదకు రాత్రి 12 గంటలకు శవదహనం జరిగింది. ఆ నాడా ప్రజా సమూహాన్ని తేరిచూడడానికి పాలాక్షుడికి కూడా ధైర్యంలేదు. మరునాడు వీరారెడ్డి జాఫరులు యధాప్రకారం అజ్ఞాతవాసంలోకి వెళ్ళి ప్రజల్లో తీవ్రంగా పని జేయడం ప్రారంభించారు.

వీరారెడ్డి, జాఫరులు పారిపోయారని తన నిక ప్రజ లెదిరించలేరని నిశ్చయించుకున్నాడు దేశముఖు, రైతులకు కౌలుకిచ్చిన పొలాలన్నీ లాక్కొని 12 వందల ఎకరా లొకటే ప్లాటుగా మామిడితోట వేయాలనుకున్నాడు. ఈ ప్లాటుకు మధ్యమధ్య కొద్దికొద్దిగా వున్న రైతుల భూముల్ని స్వాధీనం జేసుకోవాలనీ, మధ్యలో అడ్డంవచ్చే ఒకటి రెండు పల్లెలను

పీకించివేయాలనీ తీవ్రప్రయత్నం చేస్తున్నాడు. వీరారెడ్డి, జాఫరులు ఇది తెలుసుకొని ప్రజల్లో ఎలా ప్రచారం జేస్తున్నారు—

## కీర్తన

తెలుగుబిడ్డా మేలుకోవోయ్ నైజాము
తెలుగుబిడ్డా లేచిరావోయ్ ॥తెలు॥

నదులు నగములు గనులు - నలనల్ల భూములూ
కలవు నీ దేశాన - గంజినీళ్ళే కరువ ॥తెలు॥
దున్ని చెమటోడ్చి ఈ - మన్ను బంగరుజేసి
కరువుతో జచ్చేటి - గతి ఏమి పట్టినది? ॥తెలు॥
వున్న భూమిని విడచి - కన్నీరు గార్చుచూ
ఇన్నిటికి రిక్షాను ఎన్నాళ్ళు లాగెదవు? ॥తెలు॥
ఈ భూమి నీ దెరా - ఈ గనులు నీవెరా
ఎవడు ఈ నైజాము? - ఎవరు ఈ దొరలంత? ॥తెలు॥
రుద్రమాంబ ప్రతాప - రుద్రులకు వారసుడ
పౌరుషము జూపించి - పరువు నిలబెట్టరా ॥తెలు॥
బందగీ రక్తంబు - చింది జ్వాలై లేచి
జాగీరుదారులను - ఊగించివేసింది ॥తెలు॥
నిన్న సూర్యాపేట - మొన్న జనగామలో
నీ యన్నదమ్ములను - నిలబెట్టి కాల్చారు ॥తెలు॥
మగల కండ్లెదుటనే - మగువలను చెరచారు
ఇంత నీచపు బ్రతుకు - ఎందుకోయీ బ్రతికి ॥తెలు॥
మాడి చచ్చేవారి - మతములన్నీ ఒకటె
కొంప లార్చేవారి - కుట్రలో పడబోకు ॥తెలు॥
కదిలించి బలగాన్ని - ఎదిరించి వైరులను
శక్తి చూపించగల - సమయ మిదె లేలెమ్ము ॥తెలు॥

**వ॥ అని చెప్పుతూ పోరాటానికి ప్రజల్ని సంసిద్ధం చేస్తున్నారు. ఎలా?**

గ్రామంబులలో జరిపిరి రహస్య - రైతు సభలు వారు
గ్రామ గ్రామమున జండాస్థాపన - ఘనులు చేసినారు
శిక్షణ యువకుల కిచ్చుచు తయారు - చేసిరి దళములను
రక్షించగ గ్రామాలను నిల్పిరి - రక్షణ దళములను
మత్తులు వైరులు ప్రజలపై కి దం - డెత్తివచ్చి నపుడు
తుత్తునియలు జేయుటకై నీచుల - ఎత్తులనన్నిటిని
ఎత్తుగు స్థలముల పహరాలుంచిరి - హెచ్చరికను సేయ
పత్తాదీయుటకై సీ. యై. డీ. - పందులన్ని వచ్చి
మారు వేషములతో గ్రామంబుల - తారాడెడి వేళ
వీరయువకు లా యుధముల - గ్రహించి విరగదన్నుచుండ్రి

**వ॥ ప్రజల ఈ మహోజ్వల చైతన్యాన్ని జూచి జాగీరుదార్లు, దేశముఖులు, అగ్రహారీకులు మొదలైన దొంగలంతా హడలిపోయారు. తుదకు వీరంతా ఒకచోట సమావేశమై మంతనాలు జరుపసాగారు. ఆ సభలో రంగారెడ్డి—ఏమని మాట్లాడుతన్నాడు—**

ఎప్పుడు కాలీ - చెప్పురీతిగా తందానా తందాన తందన
చెప్పినపనులను - చేసే వెధవలు ,,
ఏమన్నా ఎది - రించసాగిరి ,,
ఎక్కడ జూచిన - ఇదే గోలయా ,,
ఏకు మేకుగా మారుతున్నదే - ఎత్తువేయవలెను ,,
మాదిగ వెట్టిని - మానెను చేయుట ,,
పక్కలు చదిరే - కుక్క మంగలి ,,
లెక్కజేయడే - ఒక్క మాటయును ,,
గొర్రెల చేలో - గొల్ల తోల ననె ,,
ఆంధ్రమహాసభ తెచ్చి పెట్టెనీ - హానియంతమనకు ,,

కూలీరైతుల - మేలు కొలిపినది ॥తందానా॥
కౌలు దార్లకూ - కాళ్ళు తెచ్చినది ,,
దేశంబును ఈ - తీరు జేసినది ,,
దేశానికి ఈ - ముప్పుదెచ్చినది ,,
కమ్యూనిస్టులె, మన ప్రాణాలకు - కత్తులయ్యవీళ్ల ,,
బాలేముల మన - పక్కలో బల్లెం ,,
సూర్యాపేటను - చూడలేమయా ,,
జనగాంవైపు - చనలేమయ్యా ,,
ఇండ్లువిడిచి పోయేదుర్గతిమన - కిప్పుడు పట్టింది ,,
విపరీతంబగు - వెల్లువ లేచెను తందానా తందాన తందన
వెల్లువలో మన - మెల్లరమున్నూ ,,
మన బలగాలూ - మన యాస్తులునూ ,,
మన భవనాలూ - మనభోగాలూ ,,
కొట్టుకుపోయే తరుణము వచ్చెను - ఇట్టి తరుణమందు ,,
మనతగువులు మన-మంతతీర్చుకొని తందానా తందాన తందన
కలసి కట్టుగా - కదలకపోతే ,,
మన యాస్తులును - మన బ్రతుకులును ,,
నిలువవు నిలువవు - తెలుసుకోండయా ,,
నిలువలేదు ఇక మన ప్రభుత్వమే -
నీవు నేను లెక్కా ,,
ఆ మాటలు విని ఆనందంతో తందానా తందాన తందన
పందులవలె తిని - చిందులు తొక్కే ,,
ఆశాపరులూ - దేశద్రోహులు ,,
భళీభళీ యని పలుకుచు పొంగుచు ,,
అందరు కలిసీ ఒక్కమాటుగా-ముందుకు వచ్చారు ,,

వ॥ మన అందరి బ్రతుకులు ప్రమాదంలోనే వున్నాయి. మరి రంగారెడ్డిగారి గ్రామాలలోని ప్రజలు ఆగేటట్లులేరు. ఆయన మామిడితోట వేసుకోబోతే అడ్డగించుతున్నారు కనుక ముందు మన బలగా లన్నింటిని ఆయనకు సహాయం పంపాలన్నాడు ఒక దేశముఖు—అందరూ అంగీకరించారు.

తరువాత కొన్నాళ్ళకు చుట్టుపట్ల గ్రామాలలో ఉన్న రౌడీ లందరూ రంగారెడ్డిగారి మేడలో దిగుతున్నారు. 4, 5 సారా పీపాలు కూడా వచ్చాయి రిజర్వు పోలీసులుకూడా దిగుతున్నారు. ప్రజలు ఈ ప్రమాదాన్ని గుర్తించి వీరారెడ్డి, జాఫర్ నాయకత్వాన పోరాడటానికి సిద్ధపడ్డారు మరునాడు రంగారెడ్డి ప్రజల భూములను స్వాధీనము చేసుకోడానికి తుపాకులు, ఈటెలు, బల్లేలతో తన రౌడీ బలగంతో, రిజర్వు పోలీసులతో కదిలాడు. ఇవతల ప్రజలు ఎలా సిద్ధపడుతున్నారయా అంటే—

## కీర్తన

నిరుపేదల - రణభేరి మ్రోగెను ॥నిరు॥
గుండాలను నిస్సందేహము రణరంగాన
కూల్చివేయనిదె ॥నిరు॥
ద్రోహుల్గని యపారమగు భీతిచెంది
ఖంగారున పర్వులెత్త ॥నిరు॥
కార్మిక కర్షకులైక్యమై తమ నినాద ఘోషలన్ సలుపగ విరోధు
లంద రతిచింత తమ తలల నిలకువంచగా నదే వినుడు ॥నిరు॥

వ॥ ఈ విధంగా బయలుదేరి సముద్రం పొంగి పైన పడినరీతిగా పొర్లివస్తున్న ప్రజా సమూహాన్ని చూచి దేశముఖు గుండాలు, రిజర్వు పోలీసులు ఏం చేస్తున్నారు—

కూలీ రైతులపైన తుపాకులు - క్రూరులు కాల్చారు
నేలమీదబడి వచ్చుగుండ్ల - నవలీల దప్పుకొనుచు
ఉరుములవలె గర్జించుచు వడిశెల - గిర గిర గిర తిప్పి
ఉరవడి పరవడి చేయుచు హుమ్మని - అరిమూకలపైన
రాళ్ళవర్షమును కురిపించిరి అ - రైతులు కూలీలు
రాళ్ళూ నీళ్ళందింపసాగిరా - రమణులు రంగమున
కాసింబీ కాంతమ్మయు మండుచు - కదనభూమి కురికి
కాశెలు బిగించి ముందుకు సాగిరి - కారపు ముంతలతో
తుపాకిగుండ్లను తప్పుకొనుచు తగు - వుపాయముగ లేచి
తుపానువలె యువకులు వైరులపై - దూకసాగినారు

వ॥ నీచులైన రౌడీలనూ పోలీసుల్నీ యెదిరించి, ప్రజలెలా పోరాడుతున్నారు?—

అవని ఈని నట్లు రుదెంచిన ప్రజ - లధములపై బడిరి
జవాబు జెప్పెను తుపాకిగుండుకు - చక్కగ వడి శెలయె
ఈటెకు బల్లానికి జవాబు ఒక - లాఠీకర్రేను
సూటిగ వడి శెలరాయి విసర నది - చుక్కవోలెబోయి
తెగతిని వచ్చిన పగవాడికి యది - తగిలె తలకు సరిగ
పగిలె పుర్రె పదహారు వక్కలుగ - పడెను వాడు ధరణి
గుండు తగిలి ముందున్న యువకుడట - కూలుట కన్గొనియు
రెండవ యువకుడు ముందుకురికి వొక - గుండాపై దూకి
తన్నిన తన్నుకు గుండా కక్కెను - తవ్వెడు రక్తంబు
అన్ని వైపులుగ ప్రజలు మైనబడి - ఘాతమార్చుచు నుంధ

కుయ్యో మొర్రోయని యల్లాడుచు - గుండాల్ పోలీసు
లయ్యో బాబో చచ్చితిమంటూ - అరచుచు యేడ్చుచును
పరుగిడ సాగిరి పొలాల కెగబడి - పిరికి పందలంత
పరుగిడు నీచుల ప్రజలు వెంటబడి - తరిమి తన్నినారు

వ॥ ఈ దెబ్బకు అదిరిపోయి కరణం శంకర్రావు, దేశముఖు కలిసి పట్నందారి పట్టి బ్రతుకుజీవుడా యని బయటపడ్డారు. దొరికిన కొండడు మొదలైన రౌడీలకు ప్రజలు తగిన బుద్ధిచెప్పారు. తరువాత కూలీ రైతులందరూ విజయోత్సాహంతో ఒకసభ చేశారు—

కూలీ రైతులు చాల సంతసమునా ॥తందానా॥
స్త్రీలు పురుషులొక చోట జేరినారు ,,
కూళల రోగం - కుదిరిందన్నారు ,,
చేలన్నీ ఇక మనవే నన్నారు ,,
బానిసత్వమే పోయిందన్నారు ,,
ఖూనీకోరులు కూలిరి అన్నారు ,,
ఏలజాగు కట్టండి యరకలనిరి ,,
యాలపాటలను పాడసాగినారు ,,
హిందూ ముస్లిం భేదము లేదోయి ,,
అందరన్న దమ్ములవలె మెలిగారు

తందానా భాయ్ దేవసందనానా తందానో

వ॥ ఆనందంతో పొంగిపోతున్న ఆ ప్రజల నుద్దేశించి వీర యోధులు వీరారెడ్డి, జాఫరులు యేమంటున్నారు—

సందేహము లేదన్నలార జయ - మంది నాము మనము
అందర మిట్లే నిలచియున్న మన - నణచలేరు ఎవరు
కాని ఇంకమన శత్రువులెందరో - కలరు తెలిసికొనుడు
ఈ నీచుల కాపాడు ప్రభుత్వం - బింకపోవలేదు
తనతొత్తుల రక్షణకై సేనల - తరుముతుంది యిటకు
అణచ లేక ప్రభుత్వము మనలను - కనులు తేలవేసె
చాటు నుండి యీ కుంకలందరిని - నాటకమాడించె
బూటకపు బ్రిటిష్ ప్రభుత్వముందది - నేటుకు వస్తుంది.
హంతకులందరి కూడగట్టి మన - నణచగజూస్తుంది
ఇంతకు ఈ ముగ్గురు నశించనిదె - ఇచట శాంతిలేదు
కాన ముందుగల పోరాటానికి - కత్తులునూరండి
మీన మేషములు లెక్కించక యిదె - మేలుకొనండనిరి

వ॥ వారి మాటలువిని పుద్రేకులైన ప్రజలులేచి, మా బొందిలో ప్రాణాలున్నంతవరకు పోరాడి జయించి తీరుతామని శపథం చేశారు. జయజయధ్వనులు మిన్నుముట్టినై.

ఓ తెలుగుబిడ్డడా స్వాతంత్ర్యయోధుడా
లేవయ్యా లేచిరావయ్యా

| | |
|---|---|
| జాగేల నిదురమేల్కొర | భళిభళి |
| జనగామువైపు చూడుముర | ,, |
| బాలేముల ప్రజలగనర | ,, |
| జ్వాలలను లేపుతున్నారు | ,, |

కత్తులను చేబూని నెత్తురొలికించుతూనిలచి -
పోరాడుతున్నారు

అదిగొ కాశ్మీరు దేశాన భళిభళి
ఇదిగొ తిరువాన్ కూరులోన ,,
నినుబోలు ప్రజలెయున్నారు ,,
నీవలెనె మేలుకొన్నారు ,,
ఈ మహారాజులను - ఈ దేశద్రోహులను
ఎదిరించి పోరుతున్నారు
ఈ మహారాజులన నెవరు భళిభళి
ఇట్టి ద్రోహులు లేనె లేరు ,,
తల్లిపాలను తాగి వీరు ,,
తల్లి రొమ్మునె గుద్దుతారు ,,
ఎన్నాళ్ళనుంచియో - ఇంగ్లీషు దొరలంత
ఈ కుక్కలను బెంచినారు
ఈ మహారాజు లీనాడు భళిభళి
ఇంగ్లీషువాడి కేతోడు ,,
ఈ నీచులకు తోడు వాడు ,,
ఆ నీచునకు తోడు వీరు ,,
ఘాతకుల నిద్దరిని - కాలుజేతులు గట్టి
గంగలో గలపాలి రార
రాక్షసుడు ఇంగ్లీషువాడు భళిభళి
కక్షలను బెంచుతున్నాడు ,,
హిందు ముస్లిమున కీనాడు ,,
ఎన్నొ తగవులు బెట్టినాడు ,,

అరచేత వైకుంఠ - మును జూపి మన పెద్ద
లందరికి మచ్చుజల్లాడు

పర ప్రభుత్వాన్నదిగో చూడు భళిభళి
నావికుడు ఎదిరించినాడు ,,
సైనికుడు తోడు నిలిచాడు ,,
కార్మికుడు ముందు కురికాడు ,,
కర్షకుడు చేయి గలిపాడు ,,

బ్రహ్మాండమగు - విప్లవ జ్వాలలను లేపి
పగవాని తరుముతున్నారు

ఓడలెక్కె బ్రిటిషు దొరలు భళిభళి
కాపాడుకొన జీవితములు ,,
పాడు సంస్థానములలోన ,,
తిష్ట వేస్తున్నారు గాన ,,

పరమ ద్రోహులబట్టి - పశ్చిమాంబుధిలోన -
పడనెట్టవలెను రావోయి

ధీరుడా నిదుర మేలో్కర భళిభళి
తెలుగుబిడ్డా లేచిరారా ,,
వైరిమూకల చీల్చిచెండి ,,
స్వాతంత్ర్యమును పాదుకొలిపి ,,

చక్కగా నీ విశా - లాంధ్ర ప్రజారాజ్య - స్థాపనము
జేసికొనుమోయి

(స మా ప్తం)

**KASTAJEEVI-TELANGANA—Sunkara Satyanarayana**



## సుంకర సత్యనారాయణ
(1909 – 1975)

శ్రీ సుంకర సత్యనారాయణ 1909లో కృష్ణాజిల్లా విజయవాడ తాలూకా ఈడ్పుగల్లులో జన్మించారు. అభ్యుదయ రచయితగా, నాటక కర్తగా పేరుగాంచారు.

అలహాబాద్‌లో హిందీ విద్యాభ్యాసం చేశారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. వాసిరెడ్డి భాస్కరరావుతో కలసి 'మా భూమి', 'ముందడుగు', 'పరివర్తన', 'అపనింద' నాటకాలు రచించారు. కష్టజీవి, తెలంగాణా, అల్లూరి సీతారామరాజు, అమరజీవి, లెనిన్, అమరయోధులు తదితర బుర్రకథలు, అనేక నాటికలు, జానపదగేయాలు రచించి యువ రచయితలకు మార్గదర్శకులయ్యారు.

విశాలాంధ్ర నిర్మాణం కోసం జరిగిన ఉద్యమాల్లో పాల్గొన్నారు. ప్రజానాట్యమండలిలో క్రియాశీల పాత్ర వహించారు.

పల్లెటూరు, నమ్మినబంటు, భూమికోసం మొదలైన సినిమాలకు సంభాషణలు రాశారు.

శ్రీ సుంకర 1975 సెప్టెంబరు 9న అమరజీవులయ్యారు.

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadapally, Hyderabad-20.

## Check List

| Book Number | DvKnID289 | Date | 05/04/22 |
|---|---|---|---|
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 34, 69 | | |
| Missing Pages | NO | | |
| Prepared By | Mouni | Cutting By | Mouni |
| Scanned By | Amrutha | Pages | 73 |